శ్రీ మైలవరం బాలభారతీ నాటకసమాజమువారిచే

ప్రదర్శింపఁబడు

పతీప్రతాపము.

అను

# అనసూయానాటకము,

మా పుస్తకములు కావలసినవారు
కందుల గోవిందం, జనరల్ బుక్కుడిపో,
బెజవాడ, కృష్ణాజిల్లా అని వ్రాయవలెను.



గ్రంథకర్త:

కీ. శే. సోమరాజు అచ్యుతరావుగారు.

## నాటకరత్నములు:—



| | |
|---|---|
| శ్రీమతీదేవి అను పర్వత నారద:గర్వభంగము శ్రీ॥ తి॥ | 1-0-0 |
| రామదాసు:రా॥ నా॥ | 1-0-0 |
| పాదుకాపట్టాభిషేకం కో॥ స॥ | 1-0-0 |
| భక్తకబీరు డిటో | 1-0-0 |
| కనకతార ము॥ చం॥ | 0-12-0 |
| తిలోత్తమ గూ॥ కో॥ | 0-12-0 |
| మహానంద ద్రో॥ సీ॥ | 1-0-0 |
| సతీ అనసూయ పో॥ రా॥ | 1-0-0 |

## స్త్రీలపాటలు.

| | |
|---|---|
| కూరి సుబ్బారావు పాటలు 1 భాగము | 0-12-0 |
| డిటో రెండవ భాగము | 0-12-0 |
| వేడుక పెండ్లిపాటలు | 0-8-0 |
| మహిళామనోరంజనీ పాటలు | 0-5-0 |

వలయునారు:—

కురుకూరి సుబ్బారావు,
బుక్కు—సెల్లర్ అండ్ పబ్లిషర్,
భీమడోలు, ప॥ గోదావరిజిల్లా.

శ్రీ మైలవరము బాలభారతీ నాటకసమాజమువారిచే

ప్రదర్శింపఁబడు



శ్రీ

పత్నీప్రతాపము

అను

# అనసూయానాటకము

(ఆఱంకముల నాటకము)

(కర్కశాప్రహసన సహితము.)

గ్రంథకర్త:

కీ॥ శే॥ సోమరాజు అచ్యుతరావుగారు.

పబ్లిషర్,

కురుకూరి సుబ్బారావు,

బుక్కుసెల్లర్,

భీమడోలు, ప॥ గోదావరి.

మొదటికూర్పు 1000.

కాకినాడ:

కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1927.

 రు 1-0-0

# ఈ నాటకమునందలి పాత్రలు.



## పురుషులు.



1 అత్రిముని—ఒకమునీంద్రుడు
2 నారదుఁడు—దేవముని
3 విష్ణు
4 శంకరుఁడు } త్రిమూర్తులు
5 బ్రహ్మ
6 మన్మధుఁడు — కామనాయకుఁడు
7 భృంగి—శివానుచరుఁడు
8 పాపములు 4—గంగను చుట్టుకొన్నవి
9 భూతము—భృంగి కల్పించినది
10 కౌశికుఁడు— ఒకకుష్ఠురోగి
11 ఇంద్రుఁడు—దేవపతి

## స్త్రీలు.

1 అనసూయ—కథానాయిక
2 నర్మద—కౌశికునిపత్ని
3 లక్ష్మి
4 సరస్వతి } త్రిదేవులు
5 పార్వతి
6 సుశీల— ఒక కన్య
7 ఆకాశవాణి—గగనవాణి
8 గంగ—దేవనది

# ప్రహసనాంతర్గత పాత్రలు.



## పురుషులు.



1 అనుభవానందుఁడు—కథానాయకుఁడు

2 రామశర్మ—ఒక బ్రాహ్మణుఁడు

3 సోమదత్తుఁడు—ఇరుగుపొరుగు పెద్దమనుష్యుఁడు

4 కొత్వాలుకుమారుఁడు

5 వీరిశెట్టి— ఒక షాహుకారు

## స్త్రీలు.

1 కర్కశ—కథానాయిక

2 శాంత—సోమదత్తుని భార్య

3 చాకలి

4 తార్పుగత్తె





శ్రీ

# పత్నీపరితాపము

అను

# అనసూయానాటకము.



## ప్రథమాంకము.



ప్రథమరంగము — గంగానది.

[కొందఱు తీర్థవాసులు ప్రవేశము]

అందఱు— పాట.

మధ్యమావతి — రూపకం.

భాగీరథి మాతల్లి । కరుణోదధి కల్పవల్లి॥ భా॥
వేగ మాదురితంబుల । వేలార్పుము ధృతి బేర్పుము॥ భా॥
అఖిలదోషములు నీవే । యణంపగల పావనివని ।
నిఖిలభారము నీయెడ । నిలిపితిమో దీనావని॥ భా॥
జయ ! గంగాభవానికి జయ !!

(గంగాజలములందు స్నానముచేసి నిష్క్ర॥)

[తరువాత గంగయందు స్నానమాడినవారి పాపములు భూతాకృతులతో గంగను తరుముకొని వచ్చుచున్నవి.]

(అనుబంధము 1)

గంగ— (అనుబంధము 2.)

ఓ దీనరక్షకా! విపక్షశిక్షకా! పాపాచరణంబు సలిపినవా రందఱును నాయందవగాహము సలిపిన కారణమున వారి పాపంబు లెల్ల ననుంబట్టుకొని బాధించుచున్నయవి. నా కింక రక్షకు లెవ్వరు? ఎవ్వరిం బ్రార్థించిన నీపాపంబులు వాయఁ గలవు?

(అనుబంధము 3)

[ఆకాశవాణి కనఁబడును]

ఆకా— భాగీరథీ! విచారింపకుము! నీపాపంబు లీవిధంబునఁ బోఁ జాలవు. ఒక మహాపతివ్రత శాపంబున సమయఁగలవు. మహా సాధ్వి నన్వేషించుచుం జనుము.

(అనుబంధము 4)

(తిరోహిత యగును)

గంగ— ధన్యురాల నైతిని. ఆకాశవాణి యాదేశమే నా కిప్పు డనుస రణీయము. లోకంబున పతివ్రతలన్న — బ్రహ్మ విష్ణు మహేశ్వరు ల సతులగు త్రిదేవులే పతివ్రతలు; వారి శరణంబె వేఁడదఁ గాక. (నిష్క్రమించును.)

పాప— (అనుబంధము 1)

(వెంబడించును.)



రెండవ రంగము.

[ఆకాశమార్గమున నారదుఁడు ప్ర॥]

నార— (అనుబంధము 5)

పుట్టించినవాఁడు పెట్టకమాన డను మాట నిజమే యని నే నాత్మానుభవంబునం దెలసికొంటిని.

ఆ. బండలోన నున్న మండూకములకును
నండములఁ జెలంగు పిండములకు
భుక్తినొసఁగునట్టి భువనేశుఁడే కల
హాశనంబు నిచ్చి యరయు నన్ను.

నేఁడేకలహంబుఁ గల్పించిన, నారదుండ నగు నాకడుపునిండునో తెలియరాదయ్యో.

సీ. కల్పింతునా చిన్నకలహంబు నేఁడేని
హిమశైలతనయామహేశ్వరులకు
పుట్టింతునా చిన్నపోలయల్క నేఁడేని
యిందిరావైకుంఠమందిరులకు
కలిగింతునా చిన్నకయ్యంబు నేఁడేని
శారదానిగమవిశారదులకు
సవరింతునా చిన్నజగడంబు నేఁడేని
ముందుపౌలోమీపురందరులకు
జుట్టుముడివెట్టి చూతునా సురల కెల్ల
గొలవిలే నగ్గిఁ గాల్తునా కులములను
తగఁ బ్రదర్శింతునా చమత్కారముగను
ప్రకటితంబైన కలహనాటకము నొకటి.

(ఆలోచించి) ఆఁ! తెలసె. తెలసె. చక్కని యూహ తోచినది. యోగదృష్టిం బరికింప—తనలోమున్గిన పాపుల పాపంబులు తన్నుఁ జుట్టుకొన బాధనందు భాగీరథి, గగనవాణి యాదేశంబున తత్పాపబాధావిముక్తికై—త్రిదేవుల కడ కరుగుచున్నట్లున్నది. గంగ వెఱ్ఱియే కాని, త్రిమూర్తుల భార్యల మన గర్వంబునఁ గన్నులు నెత్తి కెక్కిన త్రిదేవులా సాధ్వులు! వారా యీమె పాపంబులం బాప సమర్థతగలవారు. ఇందు

వలన గంగ యభిమతంబు విఫలంబగుటే ఫలంబగు. కావున నిప్పుడు నే నచటికరిగి — భూతలంబున మునితిలకుండై భాసిల్లు నత్రియను తాపసిశ్రేష్ఠుని సతీమణియగు ననసూయకడకుం బోయిన నీపాపంబులు వాయునని నేను గంగ కెఱింగింతునేని, త్రిదేవు లలుకదాల్చి యామె సాధ్వీత్వముం బరిశోధింపక పోరు — అందు నయితము వారికి పరాభవమే కలుగును. భళి భళీ — ఎంతచక్కని యాలోచన చేసితిని? ఇట్టికలహ మిదివఱకు నేను ఘటింపఁజేసినది లేదు. ఇది నాకు మృష్టాన్న భోజనము.

సీ. పతిమాట తనకొంగు బంగారుమూటగాఁ
దలఁచి యానందించు ధన్యచరిత
హృదయేశుఁడే జగదీశ్వరుం డని భక్తి
నిరతంబుఁ బూజించు నిర్మలాత్మ
వరునామవరపునశ్చరణంబునే — సదా
వృత్తిగా జీవించు విమలశీల
ధరణి సాధ్వులకెల్లఁ దలమానికంబయి
దీపించుచుండెడు పాపరహిత
యందమున రతి — తాలిమియందున క్షితి
యగు సతీయనసూయమహాత్మ్య మిప్పు
డమరనది కారణమున నాశాంతరముల
నలమి యాచంద్రతారార్క మగును గాక!

నే నిఁక రయంబున వైకుంఠంబున కరిగెదను.

(అనుబంధము 6)

(నిష్క్రమించును.)

మూడవ రంగము:—వైకుంఠము.

[ఉచితాసనములపై త్రిదేవులు చతురంగ మాడుచుందురు.]

[పాపములు వెంటనంటిరాగా గంగ ప్రవేశించును.]

పాప — (అనుబంధము 1.)

గంగ— (అనుబంధము 7.)

లోకజనయిత్రులారా! మహాసాధ్వులారా! నేను భాగీరథిని— పాపంబులచే బాధనందుచు మిమ్ము శరణంబు వేడవచ్చితిని నన్ను రక్షింపుఁడు.

లక్ష్మి — తల్లీ! భాగీరథీ! నీకీ యాపద యెటులఁగలిగె? పతితపావని వగు నిన్ను కలుషంబు లెట్లు చుట్టుకొనియెను? భయవర్జితవై పలుకుము.

త్రిదే— (అనుబంధము 8.)

గంగ—తల్లులారా! నా దీనచరిత్రము నాలకింపుఁడు.

గీ. పాపమతులు దుష్కర్ములౌ వారలెల్ల
మజ్జలంబుల నాడిరి మజ్జనంబు
లాకతంబునఁ, బాపంబు లాక్రమించి
నన్ను బాధించు నిపుడు పుణ్యాత్మలార!

పతివ్రతలరగు మీవలన నీ పాపంబులు భస్మీభూతంబులగునని గగనవాణి నాకాదేశించెను. నన్నుఁ గృపామతులై రక్షింపుఁడు

లక్ష్మి — చెలీ! హైమవతీ! బిడ్డా! సావిత్రి!—పాప మీ భాగీరథి చరిత్రము మిగుల కరుణాస్పదము. నే నీమె దుఃఖంబు వాపెదను చూడుఁడు. (జలంబులు పట్టి) నేను పతివ్రతనగుదు

నేని లోకేశ్వరుండు నా విభుఁడేని, నేను ధవునియెడ భక్తిఁ బాయనిదాననేని, యీ పాపంబులు భస్మంబు లగుఁగాక !

(జలంబులు చల్లును.)

పాప—(భస్మముకాక అట్టహాసము చేయును.)

(అనుబంధము 1.)

గంగ—తల్లులారా ! రక్షింపుఁడు; రక్షింపుఁడు.

లక్ష్మి—చెలీ ! నా సాధ్వీత్వ మేమైనఁ గొఱఁతవడియెనా ?

పార్వ—అట్లయిన, మహిషదానవుని లీల నీకలుషంబుల నేను మాయించెదను. చూఁడుము; (జలంబులు పట్టి) నేను ప్రకృతి కెల్ల బరాశక్తినైతినేని, సర్వలయంకరుఁడగు శంకరుని సతినైతినేని యీ కలుషంబులు నామావశేషంబు లగునుగాక !

(చల్లును.)

పాప—(భస్మము కాక అట్టహాసము చేయును.)

(అనుబంధము 1.)

పార్వ—ఏమిచిత్రము ! అనేక దుష్టదానవ బలాధికంబై యీ పాపంబుల శక్తి యతీతం బయ్యెఁగదా !

గంగ—సాధ్వులారా ! రక్షింపుఁడు; రక్షింపుఁడు.

సర—హిమశైలతనయా ! నీవుకా దుండుము. నేను వీని మదమణంతును. (జలంబులు పట్టి) చతుర్వేదసంభవంబునకు నేను కారణం బగుదునేని- శబ్దబ్రహ్మంబు నగుదునేని- చతుర్ముఖుని సతి నగుదునేని యీ పాపంబులు పటాపంచ లగుఁగాక ! (చల్లును.)

పాప—(భస్మము కాక యట్టహాసము చేయును.)

(అనుబంధము 1.)

గంగ—మాతలారా ! రక్షింపుఁడు ! రక్షింపుఁడు.

లక్ష్మి—సురవాహినీ! నీ పాపంబు లణంగుటకై యాకాశవాణి యొనరించిన యాదేశము క్రమమైనది గాదని తోంచుచున్నది.

పార్వ—గంగా! నీ వొకవేళ నా పలుకులను వినుటయందు ప్రమత్తవు కావుగదా!

గంగ—హా! లోకమాతలారా! మీవంటివారి సన్నిధానమున సయితము నాపాప్తి మిట్లగునెడల నావిధిని దూరవలసినదే కాని, వేరేమున్నది? ఇంక నాకేప్రకారంబున నీయవస్థ తొలంగును? నాపురాకృతంబిట్లు కట్టి కుడుపుచున్నది. మీ రేమిచేయంగలరు?........ఓ పరమేశ్వరా! దీనరక్షకా! పాపాత్ముల పాపములం బాపి రక్షించినందుల కిట్టిగతి నాకు ఘటింపం జేసితివిగదా! దుష్టుల కెట్టిగతులు గల్పింతువు? పరమపవిత్రమై- ధర్మాధర్మ విచారణభరితమైన నీ పరిపాలనంబిట్లు వ్యత్యాసము గాందగునా? తండ్రీ! నీకిది యేమి న్యాయము!-

[నారదుండు ప్రవేశించును.]

గంగ—నారదమునీంద్రా! నీకు నమస్కారము!

నార—శుభంబగుంగాక! భాగీరథీ! నీ దీనకథానకంబును నే నాత్మగతంబున నెఱింగితిని. కాని నీ వెంతవెఱ్ఱిదానవు! ఆకాశవాణి, మాటలకు నీవెంత యథార్థముం గల్పించితివి! పతివ్రతను శరణువేడుమనిన నిచ్చటికా నీవువచ్చుట!—వీరా పతివ్రతలు! ఎంతభ్రమపడితివి?

గంగ—అట్లయిన మహాత్మా! నాకిప్పు డేది తరణోపాయము!

నార—భూతలంబున, నత్రిమునీంద్రుని సతియగు ననసూయాసతి నీపాపంబులం బాపసమర్థురాలు—నీ వచ్చటికేగితివా రక్షింపంబడెదవు. సత్వరంబుగ నరుగుము.

(అనుబంధము 9)

గంగ — ధన్యోస్మి! ధన్యోస్మి!- (నిష్క్రమించును.)

పాప — (అనుబంధము 1.)

(వెంబడించును.)

నార—ఇందిరా పార్వతీ సరస్వతులారా! మీకుం గుశలమా?

లక్ష్మి—కలహాభోజనా! మా కుశలముల కెన్నడునుం గొఱంతగలుగదుగాని, నీవు గంగతో నిప్పు డధికప్రసంగ మేదియో సలుపుచుంటివి— పరాకున మేము సవిస్తరముగ విననైతిమి!- ఏదీ—మరల వచింపుము.

నార—ఒక్కసారి గాదు; నూరుసారులు—వేయిసారులయినా సతీ యనసూయాదేవి దివ్యమహాత్మ్యమును సంస్మరించి మనమందఱుచు తరింపవలసినదే! వినుఁడు.

సీ. బహుపాపతతులచే భంగమందెడువారి
 రక్షించి మోక్షసామ్రాజ్య మొసఁగు
కినుకవహించెనా దనుజపిశాచసం
 ఘంబులనైన భస్మంబొనర్చు
పైఁబడ్డ ఘోరసర్పంబునైనను మహా
 త్మ్యంబునఁ బుష్పహారంబుసేయు
మరణంబునందిన దురితాత్మునకునైన
 క్షణమున జీవదానంబుసేయు
 నతనుఁడేచినఁ జాంచల్య మందఁబోక
 నాగ్రహమునంది భయకంపితాత్ముఁజేయు
 లీలను త్రిమూర్తులనుసేయు బాలకులుగ
 తన్మహాత్మ్యంబు నెన్న నా తరమటమ్మ.

లక్ష్మి—నారదా! భటాగ్రజువలె నెంతపొగడితివి! ఒకమర్త్యకాంత

యేమి ? సాధ్వియగుటేమి ? చాలుచాలు- విన్నవారు నవ్వి పోయెదరు ? ఇట్టి యనృతంబుల నాడి నీకుఁగల పెద్దఱికం బేల పాడుచేసికొందువు ? పాపాకరంబగు భూలోకంబున పావనతయను మాట మందునకైన లభింపఁగలదా ?— చిరకాలమునుండి సంపాదించిన విద్యావిశేషంబు నీవిధంబునం దగులఁబెట్టుచుంటివేమి? వాచస్పతినందనుండవగుట నీవాచాలతం బ్రిదర్శించితివి. తనవారి దూషించి పెరవారి భూషించు నీపాడుబుద్ధి వీడవైతివిగదా ! ఎన్నియేండ్లు పైఁబడిన నొక్కమచ్చునవే పెరుగుచుంటివి.

పార్వ—కలహాభోజనా ! నీ వెప్పుడు మమ్ము నుతించితివని యిప్పుడు నుతింతువు ? పదిరుద్రాక్షులు పైనవేసికొని, యడవిలో కొంగజపముసేయు జడదారి సతులెల్ల సతులని పెద్దపెట్టున నుతించి యట్టహాసము చేయుదువు ? — మున్ను సయితమిటులే యూరుపేరులేని సావిత్రిని నుతించి, యమున కలుకగలిగించి తుదకు నీతండ్రి వ్రాలు సయితము మార్పించి పాపంబు గట్టఁగొంటివి !—ఇప్పు డీయనామకురాలి ననసూయ నొక తెం దెరపై కెక్కించితివి !- ఇట్టి మాయనాటకంబులకు సూత్రధారివై వారి వీరి జుట్లకు ముడిపెట్టుచుందువు. నీ కేమిపని యున్నది ?

సర—చెలులారా ! బాల్యచాపల్యమున మననారదుం డేదియో వదరుచుండును; అతనిమాటలు మన కేమిలెక్క ?—దానిని పోనిండు; ఆట సగములో నిలిపివేసితిమి. నారదా ! నేనును పార్వతియు నొకపక్షమున నాడుచున్నాము. నీవు లక్ష్మీదేవి పక్షమున నుండుము. త్రోసిరాజై తోపక చింతించుచున్నది లక్ష్మీదేవి.

లక్ష్మి—అమ్మాయీ! ఇంతటితో నీతనిని వదలఁగూడదు. పుత్రుండని నీవు వెనుకవైచుకొనిరాకుము. చతురంగమునకేమిలే. తరువాత నాడుకొందము. ఈనారదుఁడు మనలఁ బలుమారు దూషించుచున్నవాఁడు; ఈమారు మనపరిచార మెత్తకుండ పాఠము నేర్పవలెను.

నార—అమ్మా! ఊరక నిజానిజంబు లారయకుండ తొందరపడి నన్ను దూషించెద రేమి? మీ రాగ్రహింతు రేమోయని భయంబునందియే పూర్ణముగ నామెవిషయ మొఱింగింపనైతిని. కాని మీవంటివారంద ఆసాధ్వీరత్నమువలనఁ బావనచరిత్రు లగుదురని నానమ్మకము. మీ పతు లాసతిని మాతృభావమునం గాంచదగుదురు. అట్టిశుభకాలమును సయితము నే నీకనులం జూడకుందునా? నే నన్నృతము లేల యాడుదును? ఎఱిఁగినదాని నడిగితిరి గావునఁ జెప్పితిని. మీరు సకలవేత్తలు—మీకు మాఱాడఁ గలవాడనా?

త్రిదే— (అనుబంధము 10).

లక్ష్మి—నారదా! పోనిమ్ము. దురభిమానంబున నామెను స్తుతించితివిగాక! "వీరా పతివ్రత" లని పలికి మమ్ము దూషించితి వదియేమి?

నార—తల్లీ! నిజమాడిన నెంత నిష్ఠుర మయ్యెను.

లక్ష్మి—నీవు నిష్ఠురుఁడవై యాడిన నిజమేదియో యెఱింపుము; చూతము. నే నెట్లు పతివ్రతను గాను?

నార—సీ. ఓరామ! రామావతారంబునాడు, బం
గరు లేడిఁ దెమ్మంచు నడిగినావు
రాముని కట్టి ప్రార్థన మయిష్టంబౌట
నానాడు పలుబాము లందినావు

పార్వ—నారదా! నేనెట్లు పతివ్రతను గాను ?

నార—సీ. దైత్యుండువలదన్న దక్షుప్రజాపతి
యజ్ఞంబుఁ గాంచ నీ వరిగినావు
పరమేశ్వరున కది పరిభవం బౌట, నీ
వగ్నికీలలలోన నణఁగినావు

సర—నారదా! నే నెట్లు పతివ్రతనుగాను ?

నార—సీ. శారదా! విద్యావిశారద వయ్యు, ప్ర
జేశుని వదనంబు నెక్కినావు
కావుననే నీవు గర్భదరిద్రుల
ప్రాపకంబులు చాల వడసినావు

లక్ష్మి—ఈపాటి దోసంబులుకూడ లేనిపతివ్రతయీ మీ యన సూయ ?

నార—గీ. భువనపావన లోకైక పూజ్యలార!
శారదా పద్మినీ నగజాతలార!
పతితపావనకీర్తి యీ పరమసాధ్వి
చూడ ననసూయ యనసూయసుండు తల్లి.

లక్ష్మి—కానిమ్ము. ఆమాటమీఁదనే నిలిచియుండుము. మే మీ మానవాంగన సాధ్వీత్వముం బరీక్షింతుముఁగాక! మాకేమి నిదర్శనముం జూపెదవు ?

నార—ఇప్పుడు భాగీరథి తనపాపంబులం బరిహరించుకొన నందఱిగి యున్నదిగదా! తన్నిదర్శనముం జూడుఁడు.

లక్ష్మి—కానిమ్ము. నీమాటలయందలి నిజమేమో తెలియనేవలయును. నీవింక నరుగుము. మే మాచిత్రముం జూడఁబోవుదుము. సావిత్రీ! శాంకరీ! రండు.

నార—అమ్మా! అమ్మా! ఒక్కమాటు మీరిందువచ్చెదరా ?

లక్ష్మి—ఏమి ?

నార —(ఒడిలోన చేయిడి సవరించుకొనుచుండును.)

లక్ష్మి—అదియేమి నారదా ! ఫలాహారమేమైనఁ దెచ్చుకొంటివా ?

పార్వ —కలహభోజనములు చాలకనా వేఱుగా ఫలాహారములు ?

సర —నారదా ! నోరు తాటించి, కన్ను లార్చి గుటుకలువేయుచుం టివి !- నో రూట లూరుచున్నదా ?

నార—(గులకరాళ్ళు తీసి చూపి) ఏమున్నదమ్మా ! గులకరాళ్ళు !

లక్ష్మి— నీకేమి మతిపోయినదా ! గులకరాళ్ళు తెచ్చుకొంటివి !

నార— ఆఁకలి యగుచుండఁగా నేమియు దొరకనందున—

లక్ష్మి—ఏమియు దొరకనందున ?- గులకరాళ్ళు తెచ్చుకొంటివా ? ఆఁకలియని వానిం దినెదవా యేమి ?

నార—పచ్చిరాళ్ళ నెట్లుతినఁగలను ? పచనముచేసి పెట్టినచో- నే కాదశీఫలహారము చేయుదును.

పార్వ—సరిపోయినది. వెఱ్ఱి కుదిరినది రోఁకలి తలకు చుట్టుమను సామెతగ నున్నది.

నార—నాకు వెఱ్ఱిపట్టను లేదు- మీరు రోఁకలి చుట్టనువద్దు- అంత వివేకహీనుఁడనా?

లక్ష్మి—గులకరాళ్ళు వండిపెట్టుమను మాట కంతకన్న నర్థ మే మున్నది ?

నార—అమ్మా ! మీరు మహాపతివ్రతలని- అమోఘవచనమాత్ర మున ముల్లోకములం దలకిందులు చేయఁగల సమర్థలని- ' పెడాశతో వచ్చిన- నాయాఁకలి తీరుననుకొని యీగుఁ రాళ్ళు తెచ్చుకొంటిని కాని నాకాశాభంగముఁ గలిగించిః

లక్ష్మి—బాగున్నది; పండితుఁడవుగదా పాముమంత్ర మెఱుఁగఁ యన్నట్లున్నది. పలయునన్న ననేక భక్ష్యభోజనములును

రుచిరాన్నములు నొసంగఁగలము గాని- గులకరాళ్ళెట్లు వండి పెట్టఁగలము ?

నార—ఓహో ! ఇదియా పతివ్రతల ధర్మము ! అమ్మా ! సాధ్వి యగునది —

ఆ. అర్కమండలంబు నరికట్టవలయును
పలుగురాల నైన వండవలయు
బాలకులఁగఁ జేయవలె త్రిమూర్తుల నైన
నామె గాదె సాధ్వి యనఁగ జగతి.

లక్ష్మి—ఓహోహో ! నారదా ! మహోపన్యాసము చేసితివి ! నీ తెలివి కందఱు సంతసించినారులే. ఈపను లొకవేళ మీాయనసూయ చేయునేమో యడిగిచూడుము.

నార—ఎవ్వరి నడుగక— ఈ గులకరాళ్ళను వండించుకొని తినక యుపవాస ముందునటమ్మా !

లక్ష్మి—ఆ యనసూయ నీ కీరాళ్లు వండి గుగ్గిళ్ళను చేసిపెట్టినప్పుడు మమ్ము మఱచిపోవద్దు సుమా !

నార—ఆహా ! అటులే. మీాకునుఁ బెట్టెదను. కాని యేమో మీారు సామాన్యులా ? ముప్వురుం గలిసి తినఁదొడఁగితిరా నా కొక్కరాయి యైన దక్కదు.

—భళీ ! భళీ ! మీా కొనఁబోవు గేదె మా వేయఁబోవు తోట కూరమడి మేసిన దను కథగా నున్న దిదియంతయును.

లక్ష్మి—చెలులారా ! పనిలేనిమాట లెందులకు ? రండు పోవుదము.
నారదా ! అనసూయమాట మఱువవద్దు. పోయిరమ్ము.

నార—అమ్మా ! మీరును మఱువకూడదు.

లక్ష్మి—మేము మఱతుమా ! ఇప్పుడే చని పరీక్షింతుము.

(త్రిదేవులు నిష్క్రమింతురు.)

నార—ఔరా ! ఈత్రిదేవుల కెంత యతిశయము! ఎంతగర్వము?
ఎన్నాళ్ళీగర్వము! త్వరలో నణఁగఁగలదు.

(నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

# పత్నీప్రతాపము

అను

# అనసూయానాటకము.

## ద్వితీయాంకము.

### 1 రంగము—బ్రాహ్మణగృహము.

[అనుభవానందుఁడను బ్రాహ్మణుఁడు పూజాధ్యానమునందుండ అతని భార్య కర్కశ నిద్దురలేచి కన్నులునులిమికొనుచు ప్రవేశము.]

కర్క— (11 అనుబంధము.)

ఏమయ్యా! నాకోసం పలుదోంపుడ కెక్కడబెట్టావు? ఇప్పటి కింకా నీళ్ళేకాచావుగా వే? (పరికించి) ఓహో! కళ్లుమూసుకొని ధ్యాన్నంచేస్తువ్నావా? నాపలుదోంపుల్లమీద నావేడినీళ్లమీద నీకు బొత్తిగా ధ్యాన్నమేలేకపోయిందా!—వహావ! వహావ! మంచిపనిచేశావు. ఇదిగో! జవాబుచెప్పితివా సరి!—లేకపోతే—(అటునిటుఁజూచి) ఇదుగో! పెంటంతాకూడా యింకా యిక్కడేవుందే!—ఇల్లయినా యింకా వూడ్చావుగావే! ఈచాకిరీ అంతా—యింకా నామీదేవదిలేశావా! ప్రొద్దున్ననగా లేస్తావు ఈమాత్రింపనే చేయలేవూ—భళా! బాగున్నది; చీపురు చేతబట్టుకోక, బిగించుకొని కూచుంటావేమి? ఎవఁడు చేస్తాడనుకున్నావు.

అను—(స్వగ) ఈభూతం నిద్రనుంచి లేచింది; ఇంక నాపూజ పూర్తి
యైనట్టే—

కర్క—నోరుమూసుకొని, ముఖంముడుచుకొని, పూరుకుంటే సరి
పోతుందనుకున్నావా! నాపలుదోంపుడ కేదీ! మాట్లాడతా
వా లేదా?

అను—ఓభగవంతుడా! ఈపాపాత్మురాల్నిమంచి నాకేవిధంగా వి
ముక్తి గలుగుతుంది.

కర్క—ఊం—ఊం—నే నెఱుగుదుములే! నువ్వు ధ్యానంచెయ్య
టంలేదు, దగ్గపటలమూలేదు; మనస్సులో నన్ను తిట్టుకుంటు
న్నావు. నువ్వు తిట్టుచావు—నిన్నువిడువను. నాపలుదోం
పుల్లేదీ! ప్రొద్దున లేచి—నీళ్లుకాచక—యేంజేస్తువున్నట్టునీవు?

అను—అయితే—నేను ప్రొద్దుటనే నిద్రలేచేది, నీళ్ళుకాచడానికీ,
యిల్లూడ్చడానికీనా!

కర్క—ఊం! మరి నాకంటె ముందు నీవు లేవడమెందుకూ?

అను—భగవద్ధ్యానమూ—భగవద్భజనమూ—చేయడానికి.

కర్క—నీవు భగవధ్యానముచేస్తే—యెవరికి వారిగివాళ్లొళ్ళపడ్డది? అ
దిగాక, పలుదోంపుడకా—నీళ్ళూ—యిప్పటి కింకాలేక, క
బుర్లు చెప్పటానికి నీకు కళ్లెంత నెత్తిమీంది కొచ్చినవీ?

అను—(తన) ఈరాకుసిముండనోట ప్రొద్దున్నే యిన్నితిట్లు తినవలి
సొచ్చింది. (ప్రకా) నన్నల్లరిచెయ్యక వెళ్లు— కిటికీలో పలు
దోంపుల్లా—పొయ్యిమీద వేడినీళ్లూవున్నవి. ప్రొద్దున్న లేచి
నిద్రపోయేదాకా నాయెముకలు, కటకటకటకట—కొఱుకు
కుతూవుంటావు.

కర్క—ప్రతిక్షణం లేవంగాపడంగా—నీ కీమాత్రము ప్రాయశ్చిత్త

మవుతూవుంటేనే యింతపొగరుపట్టి వున్నావే! లేకుంటే నీకు కళ్లుకనపడునా?

అను—వెళ్లు—వెళ్లు —మొహం గడుక్కున్నాక తీరుబడిగా పోట్లాడ వచ్చునులే—

కర్క—చూడు—చూడు —ఎంతెంతమాటలాడుతున్నాఁడో! నా వొళ్ళు మండేమాటలాడితివా! నానుక తెగగోస్తాను. దాని తో నీపిత్తనం తెలిస్తుంది.

(12 అనుబంధము.)

అను—(స్వగ) భగవంతుఁడా! నీమాయేమిటోగాని నాయనా! ఈపాడుప్రపంచకాన్నెంతవిపరీతంగా సృష్టించివాఁదిలేశావో యి —(తలుపువంకచూచి) చూఁడు—చూఁడు—ఎవరో త లుపుతడుతున్నారు.

[రామశర్మ అను బ్రాహ్మణుఁడు ప్రవేశము.]

రామ — సీతారామాభ్యానమః అమ్మా ఉపాదానం.

అను—వినపడడంలేదటే! రామశర్మగారు యాయవారాని కొచ్చా రు; బియ్యంపెట్టు.

కర్క—నాచేయి వీలులేదు. నువ్వులేచి పెట్టరాదూ?

అను —నేను పూజచేసుకునేవాణ్ణి లేవగూడదే!

కర్క—నేను పళ్ళుదోముకుంటున్నాను. నాకూ వీలులేదు.

అను —ఆపుల్లవతలపారేసి మొగంకడుక్కొని పెట్టు—

(కర్కశ ఒకచేత మొంగిలిపుల్లతో రెండవచేత బియ్యం తెచ్చుచున్నది.)

కర్క—(తన) వీఁడెవఁడో తెల్లవారకముందే దయ్యంలాగొచ్చి గు మ్మంలో నిలవబడ్డాఁడు. మొగమయినా కడుక్కోకుండే బిచ్చ మా? (రామశర్మంతో) ఇదుగో—పట్టు.

రామ — ఇదేంయ్యాయవారమమ్మా? బ్రాహ్మణకొంపలోనే పుట్టా వా? ఎంగిలిచేస్తో వ్యాయవారమా!

కర్క—అఁ ! భయం లేదులే—మరేమీ నీపెద్దలు చావలేదు; నా యెంగిలేమీ నీనియ్యంలో పడలేదు. పట్టుతావా పట్టవా?

రామ—ఈ అపవిత్రిభిక్ష మేలాగుపట్టను?

కర్క —పట్టకుంటే శీఘ్రంగా యిక్కడనుంచి కదులు............... కాని, నీకోసం తెచ్చినవి నేను మళ్ళీ యింట్లోకి పట్టుకొనిపోను. నీఅక్షయపాత్రిలోనే పోసిపోతాను. (పోయును.)

రామ—అయ్యయ్యయ్యయ్యో! ఇంకేముంది! చెంబెడుగింజలు— ఎంగిలిపడి తగలఁబడిపోయినవి.

కర్క—ఎంగిలి?—ఎంగిలిదయ్యంబట్టిందే నీకు? ఈపుల్లేనా యెంగిలి? —ఒక్కసారి నోట్లో పెట్టుకొని చూడు; ఎంతరుచిగావుం టుందో!

(బలవంతముగా ఎంగిలిపుల్ల నోటిలోఁబెట్టును.)

రామ —శివశివా! శివశివా!! ఓభగవంతుఁడా! భగవంతుఁడా! ఎంత మూర్ఖురాలి దెగ్గఱికీవేళ భిక్షకొచ్చానురా!—నాకీవేళ పొద్దు టనే యింతమహాపద గలిగించావా! మహాదేవా! మహాదే వా! శంకరా! శంకరా!!—

కర్క—మంచిపని జరిగింది.. .........శంకరుఁడా —నీనోట్లో మన్ను గొడతాడులే.

రామ —నానోట్లో మన్నేమోగాని శంకరుఁడు నీగుణాన్ని మాత్రి మెప్పటికయినా బాగుచేస్తాడులే.

(నిష్క్రమించును.)

అత్రి—రామరామ! భగవంతుఁడా! నే నేపాపంచేస్తే నాకీభూతకి పొత్తు కలిగించావో —.......ఓసీ!—అతిథీ— అభ్యాగతీ

వొస్తే—చేసేమర్యాద యిదేనా?—నీదెంతదుష్టస్వభావమై పోయిందీ?

కర్క—ఏమిటీ?—నాది దుష్టస్వభావమా! బంగారంవంటి స్వభావంనాది. నీదో?—నీది మంచిస్వభావమా? పలుదోంపుడక తెచ్చిస్తే నీపెద్దలు చచ్చారా?

అను—ఇల్లూడ్చి—అంట్లుతోమవలసిన పనులన్నీ నేనే చేయవలసిందా! ఇదే దేశాచారం?

కర్క—కాకపోతే నువ్వు పొద్దున్నే లేవడ మెవరి కుపకారం?

అను—నేను పొద్దున్నే లేచి గాడిదలు కాస్తున్నానా? గడ్డిమేస్తున్నానా?—పూజాద్రవ్యాలు జాగ్రత్త పెట్టుకొని జపం చేసుకుంటున్నాను.

కర్క—ఊహూ!—పూజా గీజా—జపం—గిపం—గొప్ప పూజచేస్తున్నావు?—నువ్వు దేవుడి పూజచేస్తే—నేను పొట్ట పూజ చేసుకోవద్దనుకున్నావా?

అను—ప్రపంచకములో పతివ్రతల ధర్మాలేమిటో నీకు బొత్తిగా తెలవడం లేదు.

కర్క—పతివ్రతల ధర్మాలు—మొగిడి నెత్తిన చాకెడు నిప్పులు తోడిపోయటం—అంతకన్నా యేముందీ?

అను—ఓ దేవీ! నన్ను క్షమించు; నీతో మాట్లాడడం నాకు చేతగాదు. నీకు వేయిదణ్ణాలు—

కర్క—ఈ వేళొక్క రోజు దణ్ణంబెడితే సరిపోతుం దనుకున్నావా? రోజూ పొద్దున్నే వొకదణ్ణం మామూలు చేసుకో! తెలిసిందా?

అను—నీళ్లు కాగుతూవుంటే నీవు వెళ్లి మొహం గడుక్కోవేం దుకూ? ఇక్కడి నుంచి వెళ్లరాదూ?

కర్క — నీళ్లు కాగుతూ వున్నాయా? కాగుతూవుంటే తెచ్చిపెట్టు— అక్కడికి వెళ్లి తెచ్చుకునే ఒంట్లోవల్లూ ?— సుకుమారమైన ఆడవాళ్లంత కష్టపడలేరన్న సంగతి తెలియదూ నీకు? మళ్లీ— యేమో చదువుకున్నా నంటావు. నీ చదువు చట్టుబండలు గాను.

అను— (దీనముగ) మంచిదానవు గాదూ నీవు— జపం జేసుకుంటున్నాను. నన్నల్లరిపెట్టక వెళ్లు.

కర్క— మెల్లగా బతిమాలుకుంటున్నావు గనక— నాకు దయొచ్చింది; ఒక్కసారి మళ్లీ దణ్ణంబెట్టు వెళతాను.

అను— (తన) భగవంతుఁడా! నాకేమి అవస్థ తెచ్చిపెట్టావురా బాబూ!— ఎవరూ చూడడం లేదు గదా! (ప్రకా) ఓదేవీ! నీకు నమస్కారం వెళ్లు.

కర్క— ఆలాగైతే చాలా మంచివాఁడవు.

(మెప్పుతో మెటికలు విరిచి నిష్క్రమించును.)

రాః— (పూజ చేసికొనుచుండును.)

[తెరలో]

కర్క— ఓవో!— ఇట చూడు. నేను చద్దెన్నము తింటున్నాను. వా చిప్పలో ఆవకాయముక్క కొంచెం వేసి వెళ్లు.

రామ— గొజలో వున్నాను; రావడానికి వీలులేదు. అదిగాక మడిగట్టు న్నాను. ఆవకాయ మయిల్లో వుంది.

[తెరలో]

మెహ మన్నయినట్టే వుందిలే— నీపూజ బుగ్గయినట్టే వుందిలే— రా చూస్తావా? ఎంగిలిచెయ్యి నెత్తిన రుద్దమన్నావా?

అను— భగవంతుఁడా! నాకెంత కష్టమొచ్చింది!

(నిష్క్రమించి తిరిగి ప్రవేశించి పూజచేయును.)

[తెరలో]

కొంచెం విస్తరంచున ఉప్పు వేసి వెళ్లు.

అను—నన్ను పూజచేసుకో నివ్వవూ ?

[తెరలో]

మళ్ళీ జవాబు చెపుతున్నావా ? నేను లేచి రానా?

అను—(భయముతో నిష్క్రమించును. మరల ప్రవేశించి పూజచేయుచుండును.)

[తెరలో]

మళ్ళీ గుడ గుడ గుడ గుడ మంత్రాలు చదువుతున్నావా? నాకు పెరు గేదీ ?

అను—దేవపూజ కట్టిపెట్టి—రేపటినుంచీ—దేవీపూజ ఆరంభించడం మంచిది.

[నిష్క్రమించి మరల ప్రవేశించి పూజ చేయుచుండును.]

కర్క—(లోపలనుండి యిల్లూడ్చుచు దేవతార్చనపై దుమ్ము చిమ్ము చుండును.)

అను—అయ్యయ్యో ! మీదికి ధూళి చిమ్ముతున్నావు. మరీ యింత గయ్యాళితనం చెయ్యకూడదు. ఆపైపు కూడువు.

కర్క—మరేమీ భయం లేదులే ! నీ దేవుడు శంకరుడేగా ! శంకరుడు వొంటినిండా పూసుకునే దిదే!—వల్లకాట్లో దేముణ్ణి సంపాదించుకున్నావే యేలాగయితేనేం ?

అను—ఇక దీని నేమన్నా లాభములేదు. త్వరగా పూజ పూర్తిచేయాలిసిందే !

(మంగళహారతి యిచ్చుచున్నాడు.)

(అనుబంధము 13)

కర్క—(చీపురు పారవేసి హారతిపళ్లెం పట్టుకొని) ఎవరి కిస్తున్నావు మంగళహారతి ?

అను—పరమేశ్వరుఁడికి—

కర్క—మరి నాకో ?

అను—నీకుగూడానా ?

కర్క—నాకే ముఖ్యంగా యివ్వాలె ! లేకుంటె చూశావా చీపురు కట్ల దెబ్బలేస్తాను.

అను—అయితే మరి తప్పుతుంది గనుకనా ?

(అనుబంధము 13.)

(అనుభవానందుఁడు హారతి యిచ్చుచుండగా కర్కశ నూతని చెప్పలు పట్టుకొని యూపుచుండును. ఇద్దఱు నిష్క్రమింతురు.)



2. వ రంగము—అరణ్యము.

[ఒక కుటీరప్రాంతమున ననసూయ కమండలముతో ప్రవేశము]

అన—(స్వగ) ఆహా ! భయానకమగు నీ యరణ్యమునందలి యీ పర్ణశాల యెవ్వరిదై యుండును ? ఒకానొక సాధుసత్తముని కుటీరమైన నై యుండవలయును. కాదేని, యీ వనముననే సంచరించు చోరులనెలవైన నై యుండవలయును! ఏదైన నిందు మానవు లెవ్వరైన నుండ తప్పదు.

(అచ్చట జపము చేయుకొను సుశీలం జూచి)

ఓహో! నాతలంపు వ్యర్థము కాలేదు. ఎవ్వరో యొకతపస్విని యుదాసీనయై జపముచేసికొనుచున్నది. (దగ్గఱకేగి) పూజ్యురాలా ! నీకు వందనము.

సుశీ—మాతా ! నీ వెవ్వతెవు ? భయానకంబగు నీ యరణ్యంబున

కిట్లు రాగతం బేమి? నీవు మార్గముం దప్పిన యప్సరసవో— దేవకామినివో యైయుందువు.

అన—భగవతీ! క్షమింపుము! నాకు విశేష సంభాషణమునకుం గాని, నీ సన్నిధిం దడవు నిలమటకుంగాని, నా వృత్తాంతము నెఱింగించుటకుం గాని యవకాశము లేదు. అనుగ్రహించి పానీయములు లభించు ప్రదేశము నెఱిగింపుము.

సుశీ—అయ్యో! వెఱ్ఱిదానా! భూతలం బంతయు శతవర్షంబులనుండియు నిర్జలత్వమునం బై యుండె—యిప్పుడు నీకు జలం బెక్కడ నుండి వచ్చును. మహాధనవంతు లగువారు సయితమీదురంతత్వామమునం దన్నపానీయముల కత్యాయాసపడుచున్నవారు— నే నన్నో—తపోబలముచేత వాయు భక్షణముననే జీవించుచుంటిని.

అన—హరి హరీ!—ఎంతకష్టము!—తల్లీ! మాయాశ్రమం బింతవఱకు జలపూర్ణమై యుంట నీ క్షామవార్త నెఱుంగలేనైతిని. అట్లయిన నా స్వామియాజ్ఞ నెట్లు నిర్వర్తింపఁగలను. జలరహితంబగు పాత్రిం గొని జలంబులకై యెదురుచూచు నాథుని నెట్లు డాయఁగలను? నేను నా పతివ్రతాధర్మమును వదలుకొనవలసినదేనా! అట్లైనన్నటికిని గాఁజాలదు.

సుశీ—అమ్మా! నీ కోరిక మిగుల దుస్తరము! ఇప్పుడు లోకమంతయు జలాభావమై పోయినది!

అన—(ప్రాంజలియై) హే గంగా! యమునా! సరస్వతీ! మాతలారా! నాకు నిరాశం గూర్పకుండు—నా ప్రార్థనములను స్వీకరింపుండు! నా స్వామికోఱకీకమండలమునిండ జలదానము చేయుండు. మీరు సత్యప్రభావము గలవా లయితి

రేని—నా స్వామి సేనాపరిభావముం బరికటపటఅపుడు—గం
గామాంతా ! అవతరింపుము — అవతరింపుము.

(అనుబంధము 14)

[పెద్దధ్వనితో భూమిలో నుండి గంగాదేవియు వెంబడించి
పాపములును ప్రవేశము.]

గంగ—తల్లీ ! అనసూయాసతీ ! శరణు—శరణు—

పాప— (అనుబంధము 1)

అన—అమ్మా ! గంగాదేవీ ! ఊరడిల్లు మూరడిల్లుము. ఈభూతము
లెవరు? వీరు నిన్నిట్లు బాధింప నేల ?

గంగ—తల్లీ ! వినుము.

గీ. పాపమతులు దుష్కర్ములౌవార లెల్ల
మజ్జలంబుల నాడిరి మజ్జనంబు
లాకతంబునఁ బాపము లాక్రమించి
నన్ను బాధించు నిప్పు డోసన్నుతాంగి.

పతివ్రతల శాపంబునఁ గాని నీపాపంబు లణంగవని యాకాశవాణి
మూందేశి పఁ డ్రిదేవ్రుల దర్శిం చితిని. నా పాపఫలంబుచే వీరు
నా పాపములఁ బోదోియ లేరైరి. తల్లీ! సాధ్వీమతల్లీ ! ఇఁక
నీవే నా దిక్కు. నన్ను కృపాత్మవై రక్షింపుము.

పాప— (1. అనుబంధను.)

అన—(జలంబులు పట్టి)

గీ. నిరత పతిపాదచింతనాపరతఁ జిక్కి,
సన్నుతించుచు గొల్చెడు సాధ్వినేని,
నాపతి త్రిలోకవంద్యపుణ్యాత్ముఁడేని
కలుషములు భస్మమైపోవుగాక నేడు. (చల్లును.)

పాప—(మంటలుపుట్టి యందు భస్మమైపోవును.)

గంగ — (ఆనందముతో) మహాసతీ అనసూయా! ధన్యోస్మి! ధన్యోస్మి!! త్రిదేవులను మించిన నీసతీత్వము నెంతని కొనియాడుదును. నీయెడల నే నత్యంతప్రసన్న నైతిని. నీవు జలంబులకై నన్నావాహించుట నెఱుంగుదును. నీకమండలమున నా జలంబులంగొని చనుము.

(గంగ చరణములనుండి జల ముద్భవింపగా ననసూయ కమండలమున గైకొనుచున్నది.)

అన — ఆహా! మాతా! ధన్యురాలను. నీ దివ్యదర్శనంబున ధన్యురాలను. నాసకలక్లేశములును విచ్ఛేదమైనవి. నామనస్సు ప్రసన్నమైనది. సతీ! భాగీరథీ! నీయుపకార మపారమైనది. కాని నాదింకొక ప్రార్థనముగల దాలింపవలయును.

గంగ — ఓసతీ! హతాశవు గావలదు. నాపై విశ్వాస ముంపుము; నీ మనోభిలాషము నెఱింగింపుము.

అన — భగవతీ! నీవిచ్చట నావిర్భవించి నన్ను గ్రహించిన వార్తను నాస్వామి కెఱింగించెదను. కావున నాతఁడు నీపవిత్రజలంబులం దవగాహంబు సలుపనైన మభిలషింపవచ్చును. అందుచే నచ్చటనుంటము నీ వవతరించి నాస్వామి స్నానమొనర్చు దనుక నిలువ వేడెదను.

గంగ — ధన్యురాలవు; ధన్యురాలవు. పతిసేవచే నీవు మిగుల ధన్యురాలవు. ఇట్టి సత్సంగశ్రేష్ఠవస్తువుం ద్రిలోకములం గానను. నీపతి సేవకై నేనీనాడే కాదు ప్రతిదినంబును నీ పర్వతపరిసరంబునం బ్రవహించెద గాక!

అన — తథాస్తు.

గంగ — అనసూయా! నీవిఁక నానందమునం జనుము. నేను నావచనంబునుఁ బరిపాలించెదను. ఈ వార్తను నీస్వామి కెఱింగింపుము.

(గంగ భూమిలోనికిఁ బోవును. ఆశ్చర్యముతోఁ జూచుచున్న సుశీల అనసూయకు నమస్కరించును.)

సుశీ—భగవతీ! నీ వింతటి శక్తిగలదానవని తొలుత నెఱుంగమి—నేను నీయెడల నపరాధ మొనరించితిని. క్షమింపుము.

అన—పుత్రీ! యోగినీ! నీవు నిర్దోష వగుదువు. నీవేమియుఁ జింతింప వలదు. నేనే—జలాశయ సంగ్రహ సంభ్రమంబున, బరిభ్రమించి నిన్నాదరముం గావించినదాన నైతిని—కాదేని యే దైన ననిష్టమైన నుందును. నన్నందులకు క్షమింపుము.

సుశీ—అమ్మా! నీయట్టి పవిత్రచరిత్ర సందర్శనంబున నేడు నాకు సుదినము. నేను ధన్యనైతిని.

అన—అమ్మా! నిన్నొక్కటి యడుగనున్నాను.

గీ. సదమలంబైన సాధు వేషంబుఁ దాల్చి
ఋషుల మునివృత్తి నీవుండ నేటికమ్మ?
పూని యిట్లేకవల- ఘోరకాననములఁ
జేరి యెవ్వరికై ప్రతీక్షింతువమ్మ!

సుశీ—పతిప్రాప్తిఁ గలుగని యభాగినినై యిట్లు నేను కుమారీదశ యందే కాలముఁ బుచ్చుచున్నాను. అమ్మా! నాచరిత్ర మతి దీనమైనది.

అన—సోదరీ! శాంతింపుము. నిశ్చింతతో నీ సంపూర్ణవ్యవస్థను వచింపుము.

సుశీ—అమ్మా! నేను తలిదండ్రులులేని యభాగ్యను- తొలుతనుండియు నావివాహముం దలపోసినపుడెల్ల వరుఁడు మరణించుచు వచ్చెను. అందుచే సంసారసుఖభ్రాంతిని విసర్జించి, యీయరణ్యంబుల వసించుచు, నహోరాత్రము లీశ్వరధ్యానమున కాలము గడుపుచున్నదానను. ఇందువలన మర్త్యలోకముక్తి

యు—స్వర్గలోకప్రాప్తియుఁ గల్గునని తలంచినదానను.

అన—అమ్మా! పరమపవిత్రవ్రతము నవలంబించితివి. ఈశ్వరప్రార్థనమునే జీవనాధారముం జేసికొంటివి. మేలయ్యె— నాస్వామి తపోమహత్త్వమున, నీశ్వరుఁడు నీయభీష్టముం దీర్చుఁగాక! నీభక్తికి ఫలము గలుగుఁగాక!

(నిష్క్రమించును.)

[ఆకాశవాణి తెరలో]

తథాస్తు భాగ్యశాలీ! సుశీలా! అనసూయాసతి యాశీర్వచనబలమున నీతపంబు నేడు ఫలించినది. నేడే నీకు స్వర్గసుఖములు గలుగఁగలవు.

సుశీ—నీ సత్యవచనమున— స్వర్గసుఖము లభిలషించిన నాకు త్వరము ముక్తి గలుగునుగాక!

[ఆకాశవాణి]—తథాస్తు!

(ఆకాశమునుండి విమానము దిగును. నర్మద ?
దానిపై నాసీనయై దివి కేగును.)

---

3. వ రంగము—వైకుంఠము.

[లక్ష్మి—సరస్వతి— పార్వతి—ప్రవేశింతురు.]

పార్వ—చెలీ! సరస్వతీ!

గీ. కాంచితిమి గద నేడు గంగాభవాని
యఘము లనసూయ దివ్యమహత్త్వమున, క
థావశేషంబు లగుట నయ్యారె యామె
సాధ్వియగుటకు నింక నాశ్చర్యమేమి?

లక్ష్మి—ఓసీ! పార్వతీ! అనసూయ సాధ్వియగుట కాశ్చర్యమేమని నారదుని తాతవలె పొగడుచుంటివే! చాలుచాలు— చాలిం

పుము. ఆ మనుష్యభామిని యెదుట నీవంత శక్తిలేనిదానవైతి వా! మహిషదానవుని సంహరించిన నీప్రతాప మంతయు నే గంగలోఁ గలిసినది ? గంగారక్షణముం బెద్దజేసి పలుకఁజొచ్చి తివి! మనము వికలమతులమై చేయలేనిపని నాయనసూయ చేయుటయు—దానినే నారదుఁడు పొగడి మనల నిందించుట యుం జాలక — నీవుసయితము పొడవుగాఁ బొగడసాగితివా! నారదుని యొక్కొకమాట మన ప్రక్కటెముకలలోఁ గ్రుచ్చు కొనలేదా? హృదయశల్యములై బాధించుటలేదా ? దాని నె ట్లైన, నవమానించి — మించినకీర్తి సాధించి, నారదుని వం చింపవలయునే కాని మనయాధిక్యమున కవమానమునుఁ గ ల్గించుకొన వచ్చునా? ఎంత పిచ్చిమాటాడితివి! మనమేమి ? మనుష్యకాంత కోటువడుటేమి ?—ప్రకృతి సంభవించినది మొదలిప్పటివఱ కిట్టివిపరీతము జరిగెనా ? అట్లు జరిగినయె డల మనము పూజాపురస్కారములు లేకుండ పేరు మాసిపో వుట కేమైన సందేహమున్నదా ?— మీరిట్టి వెఱ్ఱిపొగడ్త లారంభింపక—దాని పొగరణఁచి జారిణియనిపింప యత్నిం పుము.

(15 అనుబంధము)

పార్వ—మాటవరుసకు—మనలోఁ మాటగా—నే నట్లంటినే కాని, నాకుమాత్ర మవమానమగుట సంతసమా? అట్లేచేయుదము.

సర—మీ యిద్దఱిసంకల్పములను నే నానందముతో నామోదించు చున్నాను.

లక్ష్మి—నారదుఁ డదే వచ్చుచున్నాఁడు.

[నారదుఁడు ప్రవేశించును]

నార—పరమపతివ్రతలకు నారదుని నమస్కారసహస్రములు.

లక్ష్మి—(స్వగ) అబ్బ! ఈతని మెత్తిపొడుపు భరింప శక్యము గాకుండ నున్నదిగదా!

నార—అమ్మా! అనసూయం జూచితిరా?

లక్ష్మి—ఆఁ!—చూచితిమి!—సంతసించితిమి; నీవీదినము మమ్మవమానించితి ననుకొని, మహానందమున పరిహాసింప వచ్చియుందువు, అంతేకాదా?

నార—అమ్మా! మీరూరక, తిరస్కరింతురుగాని, నేను మిమ్మేల పరిహాసింతును. మీరు నాకు పూజ్యులు, సన్నిహిత బంధువులు. ఈ సరస్వతీదేవి నాకు తల్లిగారు. మాతండ్రియగు చతుర్ముఖునిఁ గన్నకారణమున మీరునాకు—నాయనమ్మగా రగుదురు. ఇఁక నీశాంకరియా—చెప్పవలసిన దేమున్నది? ఈమె జగన్మాత—లోకములకుఁ బెద్దమ్మ—ఇంతకు మిమ్మవమానింప నాతరమా! నాతండ్రితరమా?—నా తాతతరమా? ఇంతకు యథార్థమునకుఁ గాలముకాదు; సరేగాని తల్లీ!—అనసూయ సాధ్వియైన మీకీకడుపుమంట యేల? సాధ్వులంగని సాధ్వు లానందింతురుగదా! మీరు రోషపడెదరేమి?

పార్వ—ఏమేమీ! నారదా! నిధ్వన్యర్థములను మేము గ్రహింపలేమనుకొంటివేమో!—నీ వనసూయను కావలసినంత పొగడుకొనవచ్చునేకాని, మాప్రమేయ మెత్తవలసిన యగత్యమేమి? గంగారత్నమ్మ మనసూయ చేయుట—కాకతాళీయముగ సంభవించినదే కాని, యీజడదారిపడఁతి మాలో నెవ్వరి కీడువచ్చును? దానికి పేరేమి? ప్రతిష్ఠయేమి?

గీ. త్రిజగ దైశ్వర్యదాత శ్రీదేవికన్న
బహుళ నిగమార్థవాణి యీ వాణికన్న

కలుష నాశని నైన నా కన్న నామె
దివ్యమహిమాఢ్య యెటులయ్యెఁ దెలుపుమయ్య.

నార — అమ్మా! అట్లు శాంతముగ నడిగితి రేని, యొకటిగాదు — వేయి విషయములను, విసుగుకొనకుండ వచించెదను. అడిగితిరి గావున నాలకింపుఁడు.

సీ. మనసారఁ దలఁచెనా మహిమచే జగముల
నన్నియు హేమమయమ్ములై నిలువవలయు
పఠియించెనా యామె భర్తృ నామోక్తమం
త్రమె వేదమంత్రమై తనరవలయు
బొమముడివడుమాత్రమున భీషణాసుర
కోటి నిస్తేజమై కూలవలయు
మూర్తిత్రయంబు నాముదితపాత్రిళ్లలో
పలి పసిపాపలై నిలువవలయు
విస్మయంబేల శాంకరీ విను తెలిపెద
నించు కామానవతి యాగ్రహించినంత
మాత్రమున భస్మమగు భువనత్రయంబు
ప్రకృతిశక్తి కతీత యాపరమసాధ్వి.

లక్ష్మి — నారదా! గోమాయుశాబక మొకటి — నేనుపుట్టి రెండుమాసములు కావచ్చినది యింతగాలివాన నెన్నఁడుఁ జూడనని పలికినదఁట! నిన్నమొన్నటివాఁడవు కన్నులయిన బాగుగఁ దెఱచితివో లేదో — నీకేమి తెలియునని పలుకుచు మమ్మాక్షేపించి — మాకాల్గోటికి సరిరాని యనసూయను స్తుతింప సిద్ధమైతివి! త్రిలోకములం దిరుగుదువన్నమాటయేగాని నీకు ప్రపంచజ్ఞాన మెంతయుం గొదవసుమా! భూలోకమందలి కాంతలశక్తి

మేమెఱుంగనివా! చూడు మాయనసూయ సాధ్వి కాదని
నీనోట ననిపించినఁ జాలు గదా!—

నార—అమ్మా! అంతకన్నఁ గావలసిన దేమి? కాని మీ సంకల్ప
ములు ఫలానుకూలములు గా వేమో యని సంశయించుచు
న్నాను. శ్రమపడక మీ రీవిషయము నింతటితో మఱచుటే
సర్వోత్తమము.

(అనుబంధము 16)

లక్ష్మి—కానిమ్ము. మించిన దేమి? ఈ యనసూయావిషయముం
దుదిదాక చూచి విడువవలసినదే! పార్వతీ! భారతీ! ఆమె
నవమానించు విధము నెఱింగించెదను రండు.

(అందఱు నిష్క్ర॥)

---

4 వ రంగము—మున్యాశ్రమము.

[గ్రంథపఠనము చేయుచు అత్రిముని, అనసూయప్ర॥]

అత్రి— (అనుబంధము 17.)

గీ. నారదుం డానతిచ్చిన వారములను
దినములను లెక్కపెట్టుచు దివ్యశీల
యమనుఁ గొల్చుచు మూఁడునా ళ్ళుపవసించి
నాలుగవనాడు వని కేగు నాధుఁ గాంచి.

అన—ప్రాణేశ్వరా! ఈ సావిత్రిచరిత్రము ద్రాక్షామకరందేక్షురస
మధురమై—సాధ్వీరత్నములకుఁ గామధేనువై యున్నది.
తరువాత నెఱింగింపుఁడు.

అత్రి— (అనుబంధము 18)

గీ. మృతిదినము నే డనుచు మది నెఱుఁగకుండఁ
బ్రాణపతి కాన కేగఁ బ్రయాణమయ్యె

నేడు నిముసమైనను విడనాడకుండ—
నుందునని యాత్మగతమున నూహజేసి.

అన—ఈదివ్యచరితామృతాస్వాదనముచే—నా యాత్మకు నూతన చైతన్యము గలిగినది.

[తెరలో]

ఓహో! లోక మెంతగోష్ఠవోయినది! ధర్మాత్ము లెందును లేరే! క్షుత్పిపాసలచే దల్లడిల్లు నా కింతసేరము నాహారము నొసంగి రక్షించు దాతలు లేరే!

అన—(తనలో) ఎవ్వరో పాప మతిథులు వచ్చియున్నారు! భర్తగారికి పూజాదిద్రవ్యముల నమర్చి మరల వచ్చినపిదప నీతని నరసెదఁగాక! (ప్ర॥) నాథా! తమ పూజాసమయ మైనది.

అత్రి—ఐన జపశాలకరిగెదను.

(ఇద్దఱును నిష్క్ర॥)

భృంగి—(ప్రవేశించి తనలో) మాయమ్మయగు పార్వతీదేవి యాజ్ఞాప్రకారము నే డెట్లులైన ననసూయను కళంకచరిత్రగా నొనర్పవలయును. (ప్రకా) హా! దైవమా! ఆఁకలి—ఆఁకలి—క్షుద్బాధకుఁ దాళలేకున్నాను గదా! నన్ను రక్షించు దాతలెవ్వరును లేరే! మున్నాశ్రమము లతిథిజనులకు శ్రమాపహారము లనుమాట నేఁ డీయత్రిమునిమూలమ్మున రిత్తవోయినదా! ఓ యత్రిమహర్షీ! ఓ యనసూయా! మీచెవుల కింకను నా యాక్రందనము వినఁబడలేదా! ఇంత ప్రమత్తులై యుంటిరా? ఇంత యతిశయమా! అయ్యయ్యో! బిగ్గరగా నాగ్రహపడుటకయినఁ గంఠము లేదు. తాటియాకుల మంటవలె—గర్భగోళమున దావానలము రవుల్కొని కాలిమందుచున్నది. నాలుకపై తడిలేదు. తనువు శోషిల్లి తూలు

చున్నది. ఓసీ! యనసూయా! నీ వెంత పోతరించితివే! గుమ్మమున నేన్చు నతిథి కింత తిండివేయక లోపల మగనితో సరసములాడ నీ కెట్లు మన స్సొప్పెనే? ఓ మాలదైవమా! దయాహీనుఁడవై — నన్నీపాపాత్ముల గుమ్మమున నేల పడవైచితివి? అయ్యో! నాతల్లీ! ముసలిదాన నైన నీమొగము మూసికొనుండ నేనిందే చావవలసిన యోగ మున్నది కాబోలును! అయ్యయ్యో! ఆఁకలి—ఆఁకలి!!

అన - (ఆహారములతో ప్రవే॥) ఓ సాధుపుంగవా! పతిసేవయందుండుటచేత నిందు కాలస్యమైనది. క్షమింపుము. ఈ యాహారము స్వీకరించి మ న్ననుగ్రహింపుము. నీ కారోగ్యము కల్గుఁగాక!

భృం (కోపముతో నాహారముం గాలితోఁ దన్ని) ఛీ! పాపాత్మురాలా! అతిథు లాఁకలితోనుండ పతిసేవయని హేతువులు చెప్పుచున్న నీచేతి కబళము ముట్టిన మహాపాతకము.

(అనుబంధము 19.)

చూడు- మిదియే నాజట మొకటి పెనుభూతమై నిన్ను సంహరింప నున్నది.

[జట భూమిపైఁ గొట్టఁగా భూతము ప్రవే॥]

భూత—మహాప్రభూ! ఆజ్ఞ యేమి? ఎవ్వరి నొక్కకబళముగా మ్రింగుమని యానతి?

భృంగి - భూతమా! అతిథిభక్తి లేని యీయనసూయను గబళింపుము.

భూత—హా—హా—హా— హా—(మ్రింగఁబోవును).

అన ఓ భూతాధమా! దగ్గఱకు రాకుము. పరమేశ్వరా! ఈ కష్టకాలమున నీవే నాకు శరణ్యము. నాకీభూతబాధఁ దప్పింపుము.

(అనుబంధము 20)

భూత—హా హా - శరీరమున నగ్నిజ్వాలలు పుట్టుచున్నవి. ఈ

యనసూయను సమీపింపఁజాలను. ఈమె యొక పతివ్రత కాబోలును; మోసమయ్యె—ఓరీ! పాపాత్ముఁడా! భృంగీ! పరమపతివ్రతయగు నీమెను మ్రింగుటకా నన్నుఁ బంపితివి! నిన్నే మ్రింగెదను. నిలువుము నిలువుము—(వెంబడించును).

భృంగి—హా! హా! మహాసతీ! అనసూయా! రక్షింపుము రక్షింపుము—నాదోషము సైరింపుము.

(పాదములపైఁ బడును.)

అన—భూతరాజా! పశ్చాత్తప్తుఁడగు నీ పాపాత్ముని క్షమించి నీదారిం బొమ్ము.

భూత—(నిష్క్రమించును).

భృంగి—సాధ్వీతిలకమా! నీమహిమం బెఱుఁగఁజాలక వెకలినైతిని. నాతప్పులు మన్నింపుము. మరియొకమారిట్టి పాపచింతనంబునం బ్రివర్తిల్లను.

అన—ఓ తామసుఁడా! ఇఁకపై నిట్టి దురితంబుల దలపోయక—సాధ్వుల నెఱిఁగి మెలంగుము; పొమ్ము.

(అనుబంధము 21)

(నిష్క్రమించును.)

[వెనుక తెర వ్రాలును]

భృంగి—(ముందునకువచ్చి) నాతల్లికటపు చలవచే బ్రదికి బయటఁబడితిని. ఓ పార్వతీదేవీ! ఇంక నీపరీక్ష చాలును. నాప్రాణములమీఁది కేల తెచ్చెదవు?

పార్వ—(ప్ర॥) భృంగీశ్వరా! జరిగిన విషయము గనుఁగొంటిని. కాని, నీ వధైర్యపడకుము. మఱియొక యుపాయమున ననసూయను పరిభవింపవచ్చును.

భృంగి—ఏమమ్మా !—తల్లీ !—ఇంకను నాకు ధైర్యముం జెప్పు చుంటివా ! ఆ యనసూయ పుణ్యమాయని బ్రదికితిని గాని—నే నీపాటికి యముసింట – ప్రజ్వలించు నుక్కుస్తంభ ములతో సరసము లాడుచుండవలసినది. ఇఁక నీతలంపుల మానుము. తల్లీ ! ఆ మహాపతివ్రత శరపునకుఁ బోయి కొఱవితో నేల తల గోకకొందువు ?

పార్వ—భృంగీ ! నారదుని వెఱ్ఱి నిన్నుసయిత మావహించినదా యేమి ? మహాపతివ్రతయని యారంభించితివి ! ఇట్టి మాట లం గట్టిపెట్టి, భర్తగారి మెడఁ ని కాలసర్పముం గొనిపోయి—తన తొడపై నిద్రించు భర్తకు పరిచర్యసేయు ననసూయ మెడలో వేసితివా—భీతిచే నామె కదలును. అత్రిమునికి నిద్రాభంగ మగును. అప్పు డామెసాధ్వీత్వము సమయును. వింటివా ?

భృంగి—అబ్బా ! మరల నాకంతముసకుఁ దెచ్చితిరా ! అమ్మా ! ఆ సాధ్విపై మీ కేల.........

పార్వ—ఛీ ! కదలెదవా ! శపింపవలయునా ?

భృంగి—(భయముతో) కానిమ్ము—ఏ చావైన నేమి ?

(నిష్క్రమించును.)

పార్వ—ఇప్పుడు నారదుని స్తుతిపాఠములు తెలియవచ్చును. అన సూయయఁట ! పతివ్రతయఁట ! తా నెఱుఁగునఁట !—ఈసారి నాబారినుండి బయటఁ బడఁగలదా ! చూతము.

(పోఁబోవుచుండ)

[నారదుఁడు ప్ర॥]

నార—ఓహో హో ! పార్వతీదేవిగారు కాఁబోలును! నమస్కార ములు.

పార్వ—నారదా! మాటలోననే వచ్చితివి. విశేషము లేమైనఁ గలవా?

నార—తమకన్న విశేషములను నే నేమెఱుఁగుదును? మనకథయే పెద్దవిశేషముగ నున్నది........ మఱచితిని!—అనసూయా శ్రమమున నేదో భూతము పుట్టినదఁట—వింటిరా?

పార్వ—కానిమ్ము. అంతటితో నేమైనది. ఇప్పు డామెం బరాభవింప గట్టి ప్రయత్నము చేసితిమి.

నార—ఏమి?— భృంగిపరాభవములో నూరకుండ లేదా? మరల ప్రయత్నమా? ఎంత సాహసము!—

పార్వ—ఏమి నారదా! మానవాంగనవలన నే పరాజయము నందుదునా! నీకంటి కింత తేలిక నైతిని.

నార—అమ్మా! నీవు సామాన్యురాలవా!—పర్వతరాజపుత్రికవు! తేలికగ నెట్లుందువు! నాకంటి కన్న మాటయేమి? లోకముల కెల్ల నీవు తేలికమైతి వనుమాట నీ వెఱుంగవా?

పార్వ—ఆఁ!—ఆఁ!!—అది యెట్లు?

నార—

సీ. ధవుని యానతిమీరి దక్షప్రజాపతి
సవనంబుఁ గనుగొనఁ జనినయపుడు
లలితాంగి! నీదు కల్యాణకాలమునాడు
శివు నాదిభిక్షువుఁ జేసినపుడు
ప్రాణేశుఁ డను గౌరవం బింతయును లేక
మీరి యర్ధాంగంబుఁ జేరినపుడు
భీకరాకృతిఁ దాల్చి విభువక్షమెక్కి—ని
ర్భీతి నృత్యంబు గావించినపుడు

పదిగ నేనాటిమాటలో వెనుక నేల ?
నుర్వి నీవు నసనూయతో నోడినపుడు
నీవు పలుమూరు తెలిక గానటమ్మ
యెఱుంగవే నేను మరల నచింపనేల ?

పార్వ—నారదా ! అట్లయిన నేను పతిభక్తిహీన ననియా నీయుద్దేశము ? అనసూయను నే నోడింపనలేనా ? చూడు నా ప్రతాపము ! —

నార —అమ్మా! కొందరపడ నేల? ఈకన్నుల కీరప్పులు మూరములా? నీపతిభక్తి --నీప్రతాపము—గంగ పాపములను నీవు శపించిననాడే తెలిసినది. శాంకరీ ! బాసి కేమిగాని, యికను నీ వనసూయ నోడించు ప్రయుదలయందే యుంటివా ? తాటియాకులచప్పుళ్ళకు కుందేళ్లు బెదరునవి గాదని యెఱుంగవా ! ఎంత వెఱ్ఱిదానవు !

పార్వ—నారదా ! నన్నొంటరిదానింజేసి నీయిష్టమువచ్చిన ట్లనుచున్నావు. నీతో నే నిప్పు డేమియు వాదింపలేను. నేడు నాకుం గల్గు విజయమును—నసనూయాంపరాభవమును విన్నపిదప నీవే తల వంపంగలవు. నాకు పనియున్నది. నేం బోయెదను.

(నిష్క్రమించును.)

నార—భళీ భళీ ! కలహావృక్షము క్రమముగా పెద్దదగుచున్నది. శీఘ్రకాలమునం బుష్పించి ఫలించి నా యాంకలిం దీర్పంగలదు. ఈ కలహామహానాటకమునం దిద్రిదేవులకేకాక—త్రిమూర్తులకును గర్వభంగము గాకపోదు. సంపూర్ణమగు నానంద మారంగమును గాంచినప్పుడుగదా కల్గుట !

(నిష్క్రమించును.)

5 వ రంగము.

అత్రి యాశ్రమము.

[అత్రిమహాముని నిద్రించుచుండ ననసూయ పాదము లొత్తుచుండును.]

అన— (అనుబంధము 22)

ఇప్పుడే హృదయేశ్వరునకు నిద్దురపట్టినది. ఉదయమునుం డియు నామనము సంశయాకులమై యున్నది. కోపదారియగు జడదారి వచ్చి—భూతమును గల్పించి భగ్నమతియై పోయిన దాది— నన్నుఁ బరీక్షింప నెవ్వరో రహస్యముగ బ్రయత్నిం చుచున్నట్లు తోఁచుచున్నది. ఇదియును శ్రేయస్కరమే కదా !—ఏ మనిన—

సీ. బుద్ధిమతీదేవి పుత్రశోకార్తయై—
శివమాయచేఁ బరీక్షింపఁబడియె
సత్యహరిశ్చంద్రజననాథుఁ డట్లు కౌ
శికమౌనిచేఁ బరీక్షింపఁబడియె
ధ్రువకుమారుండుతా నవమానమంది గా
సిలి—హరిచేఁ బరీక్షింపఁబడియె
శిబిరాజు తన మేని చీముకండలు గోసి
యింద్రునిచేఁ బరీక్షింపఁబడియె
కాంచ నీపదునాల్గు జగంబులందు
ధృతమతిని దేవతల పరీక్ష కాగి
నట్టివారలె యశ మందినట్టివారు
కాగి వెల్గెడు మేల్మిబంగారమట్లు.

ఎవ్వ రేపరీక్ష చేసినను, పతిభక్తి పరవశనగు నన్నీకష్టము లంటఁజాలవు. (పాదము లొత్తుచుండును).

భృంగి—(ప్రవేశించి) పార్వతీదేవి యానతిచే—నీసతి మెడలోన కాలసర్పము విడెదం గాక!—

(అట్లుచేసి నిష్క్రమించును.)

అన—(చూచి భయముతో) అకటా! నామెడలో నీసర్ప మెక్కడిది? ఇది యేదియో భగవన్మాయగా నున్నది. ఇప్పుడు నేను భయకంపితనై—కదలితి నేని ప్రాణేశ్వరునకు నిద్రా భంగమగును. పరమేశ్వరా! నా కిప్పు డేదిదారి? ఓదేవా! దీనరక్షకా! నన్ను రక్షింప నీవే కర్తవు.

(అనుబంధము 23)

[ధ్యానింపగా సర్పము పుష్పహారముగ మారును.]

అన—ఆహా! ఈశ్వరకరుణా ప్రభావము! నమ్మి భజించువారి నీశ్వరుం డిట్లేకదా రక్షించును.

గీ. సంస్మరణమాత్రమునం గాలసర్ప మిట్లుల
పుష్పమాలికయయ్యె నద్భుతముగాగ
దీనజనవత్సలుండైన దేవదేవు
నిర్మలదయారసంబు వర్ణింపం దరమె?

(పాదసేవ చేయును.)

అత్రి—(నిద్రలేచి) దేవీ! నీ విం కను నిద్రింపనే లేదా?

అన—జీవితేశ్వరా! విశేషముగ ప్రొద్దుబోవనందున నీశ్వరమహాత్మ్యమున కాశ్చర్యపడుచుం గూరుచుంటిని.

అత్రి—ఇప్పటికి రెండవజాముసయితము మీరియుండ విశేషముగ ప్రొద్దుబోవ లే దందు వేమి? అదిగాక—పరమేశ్వరుని మహామహిమలు పరమాణువు మొదలు మేరుపర్వతమువఱకుం గల సమస్త చరాచరములయందును నిండి నిబిడీకృతములై—సర్వకాల సర్వావస్థలయందును గనుంగొనం గలిగినవారికి బ్రి

హ్మానందముం గూర్చునవియే. ఇప్పుడు నీవు క్రొత్తగ నాశ్చర్యపడవలసిన పనియేమున్నది? అదిగాక — నీకంఠప్రదేశమునం దీకుసుమహార మెక్కడిది? నిన్నటి భగవన్నిర్మాల్యమే మైనం బర్ణశాలలో లేదుగదా?

అన — నాథా! నేటి చర్యలు మహాద్భుతములుగ నున్నవి. నే నెంతని వర్ణింతును?

సీ. ప్రత్యూషమందున భాగిరథీరతు
 ణార్థ మఘావళి నణంచు టొకటి
కానలో నసహాయగతినున్న బాల నా
 శీర్వదింపంగ దివిం జేరు టొకటి
కడుతామసుండైన జడదారి విడచిన
 యాసురు సాధ్వ్యంబు నణంచు టొకటి
ఘనత రాద్భుతముగం గంఠపాశంబైన
 యహిరాజు సుమహారమగుట యొకటి
యేమి మాయయో కాని వచింపంజాల
నుదయముననుండి కష్టము లుర్విధరము
లట్లు పైంబడి మేఘంబులట్లు చెదరి
శుభఫలాంతము లయ్యె విశుద్ధచరిత.

అత్రి — ఏమిది! అనసూయా! ఇట్లైన నిది కాలసర్పముగాని పూలదండ కాదా?

అన — కాలసర్పమే — భగవత్కృపచే నిట్లు మారినది. విసర్జించిన నేమగునో చూతము.

(క్రిందవేయ పాముగ మారి పాఱిపోవుచున్నది.)

అత్రి — (ఆనందముతో)

మ. అతివా ! నీచరితాద్భుతంబు విన బ్రహ్మానందమయ్యెౕ మహా
సతులందుం దలమానికంబవయి విశ్వస్తవ్యవై యొప్పు నీ
పతినైయుంటకు నే నొనర్చిన తపఃప్రాబల్య మెప్పాటిదో
ప్రతిలే దీపదునాల్గులోకముల నోభామా ! ప్రభావాన్వితా !

అన—నాథా ! ఇది దేవరవారి తపోమహిమగాని నా దేమున్నది ?

అత్రి— (అనుబంధము 24)

ఎట్టి కష్టములు వచ్చినను మన కీశ్వరుఁడే శరణ్యుఁడు. సతీమణీ ! ప్రొద్దు మీరినది. ఇఁక జాగరం జేల గావించెదవు.

అన—భాగ్యము.

(నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# పత్నీప్రతాపము

అను

# అనసూయానాటకము.



## తృతీయాంకము.



### 1 వ రంగము—దేవేంద్రలోకము.

[దేవేంద్రుఁ డొంటరిగ ప్ర॥]

**దేవే**—(స్వగ) కటకటా! ఈసక్షోభమువలన మల్లోకములును ప్రకంపమానము లగుచున్నవి. సూర్యభగవానుఁ డుదయింపమిఁ జతుర్దశభువనంబులు నంధకారబంధురంబులై యున్నవి. ఎట్టి జగద్విలయము కలుగనో తెలియదయ్యో.

**చ.** **ఉడుతలమెల్ల** భీషణమహాసితనీరదసాంద్ర మయ్యె; భా
నుఁడు గతిఁదప్పె; భీతిలి జనల్ భయదంబగు కారుచీఁకటిం
దడబడుచున్నవార లతిదారుణకార్య మికేమి మూడునో
యడలెడు నాదుమానస మహా! విలయస్థితి కేదిమూలమో.

[నారదుఁడు ప్ర॥]

**నార**—మహేంద్రా! చింతాసాగరమగ్నుఁడవై యున్నటులున్నది.

**దేవేం**—మహాత్మా! నారదమునీంద్రా! తరుణంబున వచ్చితివి! సూర్యోదయము కాని యీజగద్విలయమునకేమి హేతువో నీవైన నెఱుంగుదువా?

**నార**—ఎఱుఁగకేమి ? ఇది పతివ్రతామాహాత్మ్యము.

**దేవేం**—అంతసత్వముగల సతి యెవ్వరు మునీంద్రా ?

**నార**—అట్లయిన నాచరిత్ర మాద్యంతము వినుము. ముమ్మిలావంత హేమావతులను గంధర్వదంపతులు కుష్ఠురోగియగు నొక మహాత్మునకు సేవచేయుచున్న సాధ్వీమణి నొకతె నవమానించిన కారణమున నిశ్శాపఫలప్రాప్తికై భూతలమున విప్రుడాయిలానందుఁడు కౌశికుఁడను కుష్ఠురోగిగను హేలావతి సుమతియను నామాంతరముగల నర్మదగను జన్మించిరి. ఆమె పతిసేవానుమోదయై —జాత్యంధుఁడును, కుష్ఠురోగియునగు కౌశికునకు హేయమునక —సేవచేయుచు కాలము గడుపుచుండెను. ఇట్లుండ కొందఱు చోరు లొకధనికునింట ద్రవ్యాపహార మొనరించి రాజభటులకు భీతినంది —తద్ధనమును తపమునందున్న మాండవ్యుని సమీపమున విడచి చనిరి. రాజభటులు మాండవ్యుని చోరునిగ భావించి కొఱతవేయ — భర్తను భుజములపై నిడుకొని తీర్థయాత్రలుసేవించు నర్మదయామార్గంబున వచ్చుచు నొకరేయి బాధనందుచున్న మాండవ్యునిఁ గానక —కొఱతం దగుల నది యాతని కత్యంతబాధాకరమై తోప "సూర్యోదయమగునంతకు నీపతి మరణించు" నని శపించెను.

**దేవేం**—తరువాత—

**నార**—సూర్యోదయమే కాకుండుఁగాక యని పతివ్రతయగు నర్మద పతిప్రాణరక్షణార్థమై భాను నరికట్టినది అందుచే సంక్షోభము కలిగెను.

**దేవేం**—మహాత్మా ! అట్లయిన నీ విలయ మెట్లు వాయఁగలదు ?

**నార**—నిజసతీత్వ ప్రభావమున నిప్పుడు భూతలమున ననసూయ

యను పతివ్రతాతిలకము లోకాతీతగుణసంపన్నురాలై యున్నది. ఆమెను శరణంబు వేడితిరేని మీ కీయాపద వాయును.

**దేవేం**—నిజముగా నామె యీయాపద గడువంబెట్టఁ దగినంత సాధ్వియా ?

**నార**—దేవేంద్రా ! ఏల సంశయించెదవు ? మర్త్యకాంతల మహత్త్వ మేమనుకొంటివి ?

గీ. నిరతచాంచల్యయుతయైన సిరినిఁబోలి
బహుజనులనోటఁ బడినట్టి వాణిఁబోలి
ప్రకృతితామససహిత శర్వాణిఁబోలి
వారు పాపస్వభావలు గారు మఘువ !

నీ విప్పు డీకొందలపాటు మాని యుం దగుదుము.

**దేవేం**—చిత్తము. (అందఱు నిష్క్ర॥)



2 వ రంగము — కౌశికుని కుటీరము.

**కౌశి**—ఓసీ ! నర్మదా ! నర్మదా !—గ్రుడ్డివాడ నని నన్నొంటరిగ విడిచి నీ వెక్కడికి బోయితివే! ఓసీ నీయిల్లు వల్లకాటిలోఁ జేర; కుష్ఠురోగముచే శరీరమున నరకబాధ గల్గుచున్నది!—నన్ను వదలి చని నీ వాడుచున్న నాటకముం జూచుటకు నాకు కన్నులు గనంబడవయ్యెను గాని నిన్నిపాటికి కఱ్ఱతో చావ మోది—సున్నములోని కెముక దొరకకుండఁ జేసి యుండుదును. నర్మదా ! నర్మదా !

**నర్మ**—(జలముతో ప్రవే॥) నాథా ! తమ వ్రణములను కడిగి కట్లు గట్టుటకై— యుష్ణోదకమును దే నరిగితిని. మీపాదముల నిటు లుంచిన—నుపచారములు చేయుదును.

కాశి—ఓసి దుర్మార్గురాలా ! నీ వెన్ని యిచ్చకములు నేర్చుకొంటి వే !—నీవు కొంపలు గాల్పఁగల కొఱవివిగాని సామాన్యు రాలవుగావు. వ్రణములు రేగి చీము నెత్తురు ప్రవాహములై కారుచుండఁగా నేను దిక్కు లేక—గ్రుడ్డితనమునఁ గదులలేక నిం దల్లాడుచుండ — నెవ్వరికడనో పెత్తనములు చేసిచేసి వచ్చి — తిరిగి నాతో నిచ్చకము లాడుటకు నీ కెంత పోతర ము !—ఎంత సాహసము ! ఆఁ ! ఇదుగో నేను గ్రుడ్డివాఁడ నను మాటయే కాని—నాకు నీ కొంకనక్కవేషము లన్ని యుఁ దెలియుచున్నవిలే !—నీ కిష్టములేకున్న లేచిపొమ్ము. సిగ్గుమాలినముత్తా ! నీతలఁ దన్నినదానిని మరియొకదానిని పెండ్లాడఁగలను. నాకు కొంచెము దృష్టిజాడ్యము—శరీరజా డ్యము దప్ప నఁదమునకు లోపమేమైన నున్నదఁటే—రంభ లవంటి సుందరాంగు లనేకులు నాపైఁ బడుచుండఁగా పూర్వ కర్మఫలముచేత గాఁబోలును— మహాపతివ్రతవని—కోరికోరి నాతల్లిముండ వట్టి దుష్టురాలవగు నిన్ను నా కంటఁగట్టినది.

నర్మ—నాథా ! మీపాదములు నాకేగ నే నెచ్చటి కరుగలేదు. జలములం గాచుట యాలస్యమైనది. ఐనను సాధ్యమైనంత త్వరితముగ వచ్చితిని.

కాశి—సరేకాని— తెల్లవాఱిన తరువాత—న న్నావేశ్యయింటికిఁ గొనిపొమ్మంటినే! ని న్నేమందమతి పూనినది! ఈచీము నెత్తు రు వేశ్యకంటఁబడకుండ కట్లుగట్టి నన్ను శృంగారించి యచ్చ టికి గొనిపొమ్ము.

నర్మ— నాథా ! ఇంకను తెల్లవాఱలేదు.

కాశి—ఓసి కుటిలురాలా! నీకడుపులో నెంత దుస్స్వభావమున్నదే! నీకు సవతి వచ్చునని యింకను తెల్లవారలే దనుచుంటివా! నీసవతిమాత్సర్యము సమయ!—

నర్మ—నాథా! నే నబద్ధ మాడుటలేదు.—

కాశి.—అదుగో! మరల నదే మాట! అబద్ధ మాడుటలే దనుచు నబద్ధ మాడుచుంటివా! అప్పు డెప్పుడో ప్రొద్దుగ్రుంకినదని చెప్పితివిగదా! ఈలోపల నేను మూఁడుసారులు నిద్రబోయి ఆరుసారులు తిండి తింటినే!—ఇంకను తెల్లవాఱ కెట్లుం డును?—

నర్మ—నాథా! తెల్లవాఱగనే తమ్ము మరణింప మాండవ్యుఁడు శపించుటయు—నేను సూర్యనిరోధ మొనర్చుటయుఁ దమరు మఱచియుందురు.

కాశి—ఆఁ!—ఆఁ!!—నిజమే సుమా! జాగ్రత్తగాఁ జూచుచుం డుము. సూర్యోదయ మైనంతనే- నాప్రాణములు నిలువున నెగిరిపోఁగలవు.

నర్మ—హృదయేశ్వరా! జాగరూకనై యున్నాను.

[అనసూయ- దేవేంద్రుఁడు ప్రవేశించుచున్నారు.]

దేవేం—సతీ! అనసూయాదేవీ! ఇదియే నర్మదాకౌశికుల కుటీర ము! ఆసుమతివలన నెట్టి జగత్క్షోభము నణంపఁజేసెదవో- పాలముంచిన నీటముంచినా నీదేభారము.

అన—దేవనాయకా! సాధ్యమైనంతప్రయత్నము చేసెదను. దైవే చ్ఛ యెట్లో యటుల జరుగఁగలదు.

నర్మ—నాథా! ఎవరోవచ్చుచున్నారు.

కాశి—కానిమ్ము- ఎవరువచ్చిన నాకేమి? వేయికండ్లుగల దేవేం ద్రుఁడు రానీ- నేనుభయపడువాఁడను గాను.

అన — అయ్యో ! దేవేంద్రుఁడే నిన్ననుగ్రహింప వచ్చినాఁడు.

నర్మ—(వినయమున నమస్కరించి) ఆహాహా ! ఏమి మాయదృష్టము !- సాక్షాత్కరించిన దేవతలారా ! మీకు మావందన శతములు !

దేవేం.—అమ్మా ! సుమతీదేవి !- నీకడ కిప్పుడొక విశేషకార్యభారమునపహించి యీసాధ్వీమతల్లియగు ననసూయాదేవిం గొని వచ్చితిమి.

సీ. మహితాత్మ నీపతి మరణింప నొకముని
కటులీల శపియించెనట గదమ్మ !
యంతరాట సూర్యోదయవిరోధ మీవుగా
వించితివని మేము వింటిమమ్మ !
నళినాప్తుఁ డుదయమందనికారణంబున,
ఘనలోకవిలయంబు గలిగెనమ్మ !
సాధ్వీ నినువేడ సకలదేవతలు న
న్నిగతిఁ గొనివచ్చినార లమ్మ !-
త్రిభువనంబుల కిపుడు సంప్రీతిగాఁగ
నినుఁడు జనియింప నీవాన తీయవేని
యఖిలజగములు నాశన మందునమ్మ !
కలికి నినుఁబోలు సాధ్వులు గలుగరమ్మ !.

నర్మ — ఆహా ! నేను నేడు మిగుల ధన్యాత్మురాల నైతిని. అనసూయాసతీ ! నీ దివ్యదర్శనంబున నాపాపలేశంబు పటాపంచలయ్యెను. మానవలోకదుర్లభం బగు దేవతాదర్శనంబును గలిగెను. ఈలోకసంక్షోభము గలుగవలెనని నేనిట్లాచరింపలేదనియు- పతిభక్తితత్పరనగు నేను నా పతి జీవనంబులను నిలుపుకొన నిట్లు గావించితిననియు- దమ రెఱుంగని విషయ

ముగాదు. అల్పజ్ఞ ననుఁ బెద్దఁజేసి పొగడిన నేమిలాభము!

ఇట్టి విషమసందర్భమున నాకర్తవ్య మెయ్యది! యానతిండు.

అన—అమ్మా! సూర్యోదయ మగుసట్లానతిమ్మటకన్న నిప్పుడు కర్తవ్య మేమున్నది?

నర్మ—అమ్మా! అనసూయాదేవి! సకలధర్మవేత్తవై మహాపతివ్రతవై యబలల ధర్మంబులు సమగ్రంబుగ నెఱింగినదాననైన నీ విట్లాడిన మూఢురాలనగు నే నేమనఁగలను. సూర్యోదయం బొనరించి నా మాంగల్యమునకు జలాంజలి వదలికొందునా! తల్లీ! ఆవల ననాథనగు నాకు మాత్రి మీజీవన మేమిటికి? తమ రిట్లు నన్నుఁ గోరరానికోరికం గోరవచ్చునా?

దేవేం—తల్లీ! జగదుపద్రవముం గాచిరక్షించిన, నీ సౌశీల్యభావ మనంతమై- జగద్విఖ్యాత మగుచుండ- సమస్తదేవగణసమేతంబుగఁ బరమేశ్వరుఁడు, నిన్నాశీర్వదించుచుండ నీపతి యేల మరణించును? నీకు దుర్గతి యేలగల్గును?

నర్మ—అట్లయిన, మాండవ్యశాపము వ్యర్థ యగునా?

దేవేం—భగవదాశీర్వచనఫలంబును- మాండవ్యశాపము ప్రతిఘటింపఁ గలదా!

నర్మ—దేవనాయకా! ఇది యేటియుపాయము! దోష మెఱుఁగని నాపతిని రాజోపహతుండైన మాండవ్యుఁడు మూఢుఁడై- మరణింప శపియించెను. పతిచింతనము వినా- పరప్రపంచకర్మంబులయందు లేశమైనం బ్రివర్తిల్లని దృఢతరస్థైర్యమును నైర్మల్యమును గలనేను- నాపతిని రక్షించుకొనఁగలను. నాపతిప్రాణంబుల కపాయముగల్గినప్పుడు నే ననాథనై - యగతికనై యచింత్యదారుణవైధవ్యబాధాపరంపరలం జిక్కి- యభాగ్యనై పోవునప్పుడు నాకు లోకములతోఁ బనియేమి?

నాపతికిఁ గల్గిన మహాపద నేవేల్పులైన గడువఁబెట్టగలరా? అట్లు గావించిననాఁడు, జగదానందకరముగ సూర్యోదయము కాఁగలను. అంతదనుక జగంబులు క్షోభింపనీ జగత్పతులా క్రందింపనీ చతుర్దశభువనంబులు నన్ను తమ శాపపరంపరలచేఁ జావ శపింపనీ యూపరక్షేత్రంబులపై గంగాజలంబు ప్రవహించినచందంబున శ్రమవహించి నాకఁడ కరుడెంచితిమని యు, మూర్ఖురాల నై నేను తమహితంబు ననుసరింపనైతి నయియు మీరందఱేకమై నను దూషించిన దూషింతురుగాక! అల్పజ్ఞానసమేతనగు నాకిదియే యుక్తకార్యమని తోఁచుచున్నది. కావున దేవా! నన్నాయాసపెట్టక దయతోఁ దమ నెలవుల కరుగ వేడుచున్నాను.

అన—(ఆనందముతో) తల్లీ! సుమతీదేవి! ఇంతకాలమునకుఁ గనఁదగిన సాధ్విం గంటిని. వినఁదగిన వాక్యరత్నంబుల వింటిని. శరీర మానందపరవశం బయ్యె. నేను మూఢమతినై దేవనాథుని యానతి మీరలేక నిన్ని పాడుకోరికం గోరవచ్చితి. జ్ఞానంబు గలిగెను. ఈ వాచాదోషమునకు నా కేప్రాప్తి గలదో గదా!

దేవేం—కటకటా! ఇదేమిపాపము! ఈయనసూయయు నర్మదకే తోడగుచున్నదే!—ఇంక లోకంబులగతి యేమి? సూర్యభగవానుఁ డిక శాశ్వతనిరోధముగ నుండవలసినదేనా? భువనంబులిఁక తేజోత్తేజితములు గావా? సకలచరాచరములుం గ్రమంబుగ వినాశ మందవలయునా? తల్లీ! సుమతీదేవీ!—సూర్యోదయమున కాజ్ఞ యీయవా? అనసూయాదేవి! అట్లీసతిం బ్రార్థింపవా?

కౌశి—పొండు పొండు- మీ కేమి పొద్దు బోవదా? సూర్యోదయ

మైనంతనే నేను చత్తునని మీ రెఱుఁగరా యేమి ? కాక నే నెట్లుచత్తునో వినోదము చూడవలయు ననుకొంటిరా ?

నర్మ—దేవా ! వీ రనసూయాదేవేంద్రులు; మనకుఁ బూజనీయులు.

కౌశి—ఓసి నిర్భాగ్యురాలా ! మరల నదేమాటాడెదవేమి ? వేయి కళ్ళుగల దేవేంద్రుఁడు రానీ నాకు భయములేదని చెప్ప లేదటే ?

అన—మహాశయా ! మీసతియగు నీసుమతి సాధ్వీత్వప్రభావమే నీ ప్రాణములకు శ్రీరామరక్షయై యున్నది. నీ కేభయమును లేదు.

కౌశి—ఏమోతల్లీ- ఎన్నఁడు కాని కేమినొప్పి. నాప్రాణములు నాకు గాని మీ కేమితీపి ?

దేవేం—దేవీ ! నర్మదాసతీ ! ఈబాధను నివారింపలేవా ?

అన—సురనాథా ! మీ కీప్రశ్న తగినదిగాదు.

దేవేం—అట్లైన పతివ్రతాధర్మంబు నరికట్టు టీమెకును తగినదిగాదు.

అన—పతివ్రతయగు కాంత పతిహితంబుకొఱ కేకార్య మొనరించి నను తగినదే !

దేవేం—బ్రహ్మాండములు సూర్యరశ్మిలేక నాశనమందవలసినదేనా ?

అన—అట్లు జరుగునంతటి కష్ట మేలరావలయును ?

దేవేం—కాక- వేఱుమార్గ మేమున్నది ?

అన—మీరు దేవపతులుగదా !- మీమహిమచే మాండవ్యుని శాపము నుపసంహరించినచో నర్మద తనశాపము నుపసంహరించు కొనఁగలదు.

దేవేం—మాండవ్యునిశాప ముపసంహరింప నీవు సమర్థురాలవనిగదా ప్రార్థించితిని.

అన—ఒకమునీంద్రుని శాపం బుపసంహరింపఁగల శక్తి నావద్ద నెక్క

డనున్నది ? అన్నిటికిని పరిభావసంపన్నయగు నీ నర్మదయే తగినది !

నర్మ—పుణ్యచరిత్రులారా ! నాదృఢసంకల్పము నవధరింపుఁడు.

ఆ. భానుఁ డుదయమంద నేను వచింప జ
గద్విలయము నేఁడు గలుగుగాక-
భాను డుదయమంద పంచత్వమందు నా
జీవితేశ్వరుండు శేషుగితిని.

[సూర్యోదయ మగును.]

ఇంద్రు—ఆహా ! లోకంబు లనుగ్రహింపఁబడినవి. భువనానందదాయకుండై జగన్మిత్రుఁ డుదయించినాఁడు.

కౌశి—ఏమి ? సూర్యోదయమైనదా ! సూర్యోదయమైనదా !- నర్మదా ! నర్మదా ! నా గొంతుకోసితివా ! హా- హా- హా-

(మరణించును.)

నర్మద—నాథా ! నాథా ! నన్ను విడిచిపోవుచుంటివా ! నన్ను గతిలేనిదానిం జేసితివా ! నే నేమిపాపముఁ జేసితిని.

(అనుబంధము 26.)

దేవేం—సతీతిలకమా ! అనసూయా ! సూర్యోదయంబగుటయు నీ కౌశికుఁడు విగతప్రాణుఁడగుటయు, సంభవించినది. ఇప్పుడీతనికి ప్రాణదానము చేయవలయును.

నర్మ—అమ్మా ! అనసూయాదేవీ ! కలనైన నితరం బెఱుఁగక పతిపాదచింతన ఘనజీవితంబు గడుపు నాసాధ్వీత్వ మిట్లు లోపింపనేల ?

అన—అమ్మా ! వగవకుము. మహాసతీతిలకమవై గతులుదప్పని సూర్యునిఁ బ్రతిఘటించి ముల్లోకంబులఁ గల్లోలపఱచిన నీ

సాధ్వీత్వమే లోపించినచో నీలోకంబు లోక్కుమాఱుగ భగ్గున
మండిపోవవా ?

నర్మ—అట్లైన నాకీ వైపరీత్య మేమి ?

అన—నీ యానతిచేతనే సూర్యోదయమైనది.

నర్మ—నే నేమియానతి చేసితిని ?

అన—నీవు పలికిన నీదృఢసంకల్పమునందు-

“భాను డుదయమంద పంచత్వమందు నా
జీవితేశ్వరుండు”

అని పలికితివి. ఇది యశ్లీలము గాదా ?

నర్మ—అయ్యయో! అట్లైన నేను భర్తృప్రాణహారిణి నగు కంటకి
నైతినా? తల్లీ! ఈజీవితము లింక నాకేల ?

అన—నర్మదాదేవీ! దుఃఖింపకుము. పరమేశ్వరానుగ్రహమున నీ
పతి జీవింపఁగలఁడు.

(జలంబులు పట్టి)

గీ. సతము పతిభక్తిఁ బాయని సాధ్వినేని
శాశ్వతాతీతలోకరక్షణముకొఱకు
పతితుఁడై యున్న నర్మదాప్రాణనాథుఁ
డంధతనుఁ బాసి జీవితుం డగునుగాక !

(చల్లును.)

కాశి—(లేచి) జీవితేశ్వరీ! నర్మదా! నీ వెక్కడనున్నావు ?

నర్మ—నాథా! ఏమి నాభాగ్యము! పునర్జీవితులరగు మిమ్ముఁ జూడఁ
గంటిని! మీకు ప్రాణములిచ్చిన పూజ్యురాలగు సతీయన
సూయకును దేవతాసార్వభౌమునకును నమస్కరింపుఁడు.

కాశి—పూజ్యులారా! వందనములు. ఎఱుఁగకాడిన నాపల్కులు
మన్నింపుఁడు.

అన } చిరాయుష్మాన్భవ.
దేవేం }

(తిరోహితు లగుదురు.)

నర్మ - ఆహా ! దేవేంద్రునితో ననసూయాదేవియు తిరోహిత యైనది. నాథా ! మనకు నేడు మహాపుణ్యాదినము గదా !

కాశి—(ఆశ్చర్యముతో దిశలం బరికించి)

దేవి ! నర్మదా ! ఏమి యీ చిత్రము ! ఇది యింద్రజాలమేమో సుమా ! నా కంటికేదియో కాన్పించుచున్నది. ప్రపంచము ప్రపంచ మని లోకులనుకొనున దిదియేనా ? నీవు నాభార్య వగు నర్మదవేనా ?- ఎంతయందముగ నుంటివి ! కన్నులులేక నిన్నెంతకష్ట పెట్టితిని ! నేను పరుండు పటకుటీరమేనా యిది ! ఆహా హా ! ఎంతయందముగ నున్నది ! నా కడుపులోనుండి యానందప్రవాహము పై కుబుకివచ్చి పొంగి పొరలుచున్నది. ఏదీ ! ఒకముద్దిమ్ము.

(అనుబంధము 27.)

తెర వ్రాలును.

ఇది తృతీయాంకము.





శ్రీ

# పత్నీ ప్రతాపము

అను

# అనసూయా నాటకము.



## చతుర్థాంకము.



### 1 వ రంగము.

మన్మ — [ప్రవేశించి] (అనుబంధము 28)

అనిర్వాచ్యమై — అప్రమేయమై — అవిలంఘనీయమై నెగడు నామాయామోహనమహేంద్రజాలమున సమస్త బ్రహ్మాండమండలములును బొంగరములవలెఁ దిరుగుచు సుఖదుఃఖములఁ గాంచుచుండ — భగవంతుఁ డనువాఁ డింకొక్కఁడు వేఱుగ నెవ్వఁడో కలఁడని — తలంచి తరింపఁజూచు నీజను లెంతటి యప్రాజ్ఞులు! ఎచ్చటనో దేవతానిలయములఁట! దేవతాపూజనములఁట! త్యాగులఁట! యోగులఁట! జపములఁట! తపములఁట! దయదలంచి నే నిష్టించ ప్రాజ్ఞులదెసఁ గన్నెత్తిచూడనంతవఱకుఁ గదా యివి సాగివచ్చుట! ఎంతవిజ్ఞానశాలియో కాని బ్రహ్మదేవుఁడు ప్రపంచోత్పత్తికిఁ గారణముగ వనితలను సృష్టించి — నా లీలావిహారంబుల కుపకరణముగ సౌందర్యముం గల్పించినాఁడు. నాపంచశరప్రభావంబునఁ బ్రపంచమెల్ల సౌందర్యమగ్నమగుం గదా! — నిండుమగతనము లేని

యర్ధనారీశ్వరుం డేమో నన్నొకమారు భస్మీభూతుం జేసె
ననియు దాన నాగర్వంబు సర్వంబు ఖర్వం బయ్యెననియు—
మందులగు పాంథు లప్పు డప్పు డుపాలంభించుచుందురు—
కాని నాయాటలు మునుపటికన్న బాగుగ సాగివచ్చుటకు
దొంగవాని కంధకారమువలె——నాకు నీయదృశ్యాకారము
వరప్రసాద మయ్యెనని యొక్కెడఁ దలంపఁను గదా ! ఇట్టి
నెట్టవేదాంతులే శీఘ్రముగ నా వలలం దగులువారు —

సీ. విశ్వమోహనలీల విప్రయోగుల నేచ
డా కేల నిక్షుకాండంబు మెఱయ
ఝుమ్మని రొదసేయు తుమ్మెదగమినారి
యావింటికోటికి నమరియుండ
పాంథులపాలిటి బ్రహ్మాసాయకములై
వలచేత సుమబాణములు వెలుంగ
భువనప్రచారంబు సవరింప శుకరాజ
మంచితవాహనంబై తలిర్ప
సతము బంటు లగుచు చైత్రవసంతు లే
మరక నాదుసేవ లరయుచుండ
లీల నీజగంబుఁ బాలింతు మన్మథ
చక్రవర్తి నెవరుసాటి నాకు ?—

పదునాలుగుజగంబుల నెందుఁగాని, యేకాలమునఁగాని నామ
హాత్మ్యం బెఱుఁగనివారుం గలరె ?

సీ. మునిశాపవశమునఁ దనువెల్ల కన్నులైన
శతమన్యుగతి నాదు శక్తిఁ గాదె
నీలకంఠుఁడు మోహినీదేవిఁ గాంచి కా
మాసక్తుఁ డౌట నాశక్తిఁ గాదె

బంధుమిత్రులతోడఁ బ్రత్తికంధరుఁడు పం
చత్వ మందుటయు నా శక్తిఁ గాదె
ఒకయప్సరసకుఁ గౌశికుఁడు గులామాట
జగదేకమద్బాణశక్తిఁ గాదె
చేరి గురుఁడగు గురుదారఁ దారఁ గోరి
శశి నిశాచరుఁ డౌట నా శక్తిఁ గాదె
మహితజగముల నెందు నామహిమ చవినిఁ
జూడని మనోబలాఢ్యు లెచ్చోటఁ గలరె ?

ఏమిది? ఆత్మకథాప్రసంగంబునం బడి నే నావలిపని మఱచుచుంటిని. అప్పుడే నామేనమామయగు శీతమయూఖుం డుదయించి జగంబులకు వెండిపూఁతఁ బూయుచున్న వాఁడు ; మలయానిలుండు వసంతసందేశముం గొనివచ్చుచున్నాఁడు. నే నింక నరుగవలయు. (పోఁబోవును).

[లక్ష్మీదేవి ప్రవేశము]

లక్ష్మి—మన్మథకుమారా ! కుమారా ! ఇప్పు డీప్రయాణం బెక్కడికి నీకు ?

మన్మ—తల్లీ ! యువయువతీనవసమాగమమునందలి—కుసుమశరనిపాలకోమల సంగ్రామ విజయానందము ననుభవింపఁ బోవుచున్నాను.

లక్ష్మి—ఆ పనియందే—నీవలన నొకపనిఁ గోరి నే నిందు వచ్చితిని

మన్మ—అమ్మా ! సెలవిమ్ము. నిన్నుఁ గా దందునే ?

లక్ష్మి—వింటివిగదా యనసూయ యను తరుణి—ధరణిఁ గలదని ?

మన్మ—ఔ నౌను. ఆమె మి మ్మెమో యవమానించెనని సయితమిప్పు డానారదుని ముఖంబున వింటిని. నే నరిగి యామె నవమానించి వత్తునా ?

లక్ష్మి—పుత్రికా! నా హృదయంబును చక్కగా నెఱింగితివి! వినుము.

(అనుబంధము 29)

క. ఆతరుణి నెట్టు లయినం
బాతకి యవమానపఱచి యపహాస్యము సం
ప్రాప్తముగ నేనె నొనరిచి
తీఱవలెను ధృవము ముద్దుకుమారా!

మన్మ—అమ్మా! ఇట్టి పనులు నాకు నల్లేరుపై బండి నడిపించినట్లే సులభాతిసులభంబులు. నాకు సెలవిమ్ము పోయి వచ్చెద.

లక్ష్మి—విజయోస్తు!

మన్మ—(నిష్క్రమించును).

లక్ష్మి—ఏప్రయత్నము విఫలంబైనను నా కుమారుం డగు మన్మధుని ప్రయత్నమట్లు కాఁజాలదు. ఆ యనసూయ నేఁడు తప్పక పరిభవింపఁబడును.

[నారదుఁడు ప్రవేశించును]

నార—లక్ష్మీదేవిగారూ! ఒంటరిగ నిలువఁబడి యనసూయ పేరెత్తు చున్నారు. ఇంకను తమ రనసూయాపరాభవప్రయత్నము నందే యున్నారా?

లక్ష్మి—అదుగో! నారదా! సమయమునకే వచ్చితివి. వింటివా! నే నిప్పు డనసూయం బరిభవింప నెంతచక్కనిమార్గ మన్వేషించితినో!

నార—అమ్మా! ఇంకను వినవలసిన యవసరమున్నదా? విని విని- వెనుకటి మీప్రయత్నములు తలక్రిందులగుటఁ గనికని సంతాపమో- సంతోషమో- యనుభవించుచునే యుంటిమి గాదా! మరల నీప్రయత్నమును విన నేల?.........వినను వెద్ద

వారు చెప్పుచున్నప్పుడు నిరాకరింపఁగూడదు! ఏది యే దానూతనప్రియత్నము?

లక్ష్మి—ఆమె యాత్మపరిశుద్ధిం జెడఁగొట్టుటకై నాకుమారుఁ డగు మారునిఁ బ్రయాణముచేసి పంపితిని. ఇందుల కేమందువు?

నార—అమ్మా! ఏమందును? మీకింతటి యజ్ఞానమేమందును.. ఆ సతి మహాసతియందును—ఈప్రియత్నము నింతటితో మాను మందును.—మిమ్ము మను మందును.

(30 అనుబంధము.)

లక్ష్మి— విధితనయా! మా వెనుకటిప్రియత్నములు నిరాధారములు గాఁగున నంతటితో నణంగిపోయె. ఇది యట్లుగాదు గదా!

నార—అమ్మా! మీప్రియత్నము లేవి నిరాధారములు? మీరా సాధ్వి నేమి సామాన్యనుగఁ బరీక్షించితిరా? బడుగుబాపని వేసము వేసి భృంగి నంపితిరి! అతఁడు కల్పించిన భూతము సా మాన్యమైనదా? కాలసర్పమును మెడలో వేయించితిరి! అప్పు డామె కదలి పతి నిద్రాభంగమునకుఁ గారణమైనచో సాధ్వీత్వమునకు లోపమే కదా! ఇట్లు పరిభవింపఁబ్రియత్నిం చుటేకాక గంగారక్షణమును గౌశికప్రాణదానమును గను లారఁ జూచితిరి! ఇప్పటికి మీ ప్రియత్నంబులను మానరై తిరి. ఈసారి మన్మథునకుఁగూడ పరాభవము గావలసియున్న దికాఁబోలును. నే నేమి చేయుదును?

లక్ష్మి—నారదా! ఏటిమాటలివి? మాపరాభవమునకుఁ బ్రతీకార ము సలుపఁగూడ దందువా?

నార—పరాభవమా! సీకా! తల్లీ! అట్లయిన నీచరిత్రము నించుక త్రివ్వి చూపవలసినదే!

చ. అనుచితమంచు నెంచక, నహంకృతి నాథునురంబున న్వసిం
చినయపుడున్ జనంబులకు శ్రీలనొసంగుమిషంబుచేత నీ
వనయము పంచపంచల నహర్నిశలు న్వసియించినప్పుడున్
మనసున నీకు నెట్టియవమానముఁ గల్గదె? నేఁడు గల్గఁగన్.

లక్ష్మి—నారదా! నీతోడ నేనిప్పుడు వాగ్వాదమునకై రాలేదు ఇప్పు డేడ? మన్మథుని ప్రయత్నము పరిపూర్ణము గానిమ్ము; నీతో కావలసినంత వాదించెదను.

నార—(స్వగతము) ఆఁ!- ఇంతటితో మన్మథుని ప్రయత్నము పరిపూర్ణమేయగును లెమ్ము. (ప్రకా) అమ్మా! అటులేకానిండు. ఇప్పుడు మన కీనిరర్థకవాగ్వ్యయ మెందులకు? రండు పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

## ద్వి తీ య రం గ ము.

అత్రిమున్యాశ్రమము.

[మన్మథుఁడు ప్రవేశము.]

మన్మ--(స్వగ) ఏమిది? నాతల్లికడ సెలవుగైకొని బయలుదేరినతరువాత నాకన్నియు నపశకునములైనవి. ఏపరాభవ మెదురు చూచుచున్నదో గదా!

సీ. గమనోన్ముఖుండనై కదలినతోనె, బ్రా
హ్మణుఁ డొంటరిగ నెదురయ్యె నాకు
సతులపాలికిఁ బోవఁ జన నపాయం బంచు
రతి బాష్పకణములు రాల నేడ్చె
కరములుకంపింపఁ బరిభవం బెఱుఁగని
శరచాపములుజారి ధరణిఁ బడియె

దుర్నిమిత్తము దోప నిర్నిమిత్తంబుగ
నెడమభాగంబెల్ల నడలదొడఁగె
పట్టుమని నాలుగడుగుల నట్టెవైచి
నంత పాదము ల్దడబాటు నందసాగె
సాధ్వి యనసూయ నొకసూరు సంస్మరించి
నంతఁ జల్లని నాగుండె లదరఁదొడఁగె.

కానిమ్ము.— నన్ని దుర్నిమిత్తంబు లేమిచేయునో చూతము! కార్య శూరుండగువాని కిది లక్షణము గాదు. లోకాతీతపరాక్రమో పేతంబగు పరివారంబంతయు నాకమరియుండ నీ భీతియేల? కటకటా! నే నెంతమందసంకల్పుండ నైతిని. నేను నాపరివా రంబు నిప్పుడే హెచ్చరించి కార్యరంగమునఁ బ్రవేశించె ద గాక!

[అనసూయ ప్రవేశము.]

అన —(సగతము) తపోవనమున కరిగిన నాథుని పాదకలం బూజిం చుకొనుటకై పుష్పపత్రాదులను సేకరించెదను. ఆహా! ఏమిది? ఈవనంబు నే డత్యంతవికాసభాసురమై యున్నది.

(పూవులు గోయుచున్నది.)

మన్మ—(స్వగతం) ఈసతికి మరులుగొల్ప నిదియే సమయము.

(బాణములను వదలును.)

అన—(స్వగతం) అబ్బ! ఏమి యీపారవశ్యము! ఏమి యీ పరితా పము!_ నాథా_ నాథా_ నన్ను పరితాపంబు పాలుగావించి చన నీకు భావ్యమే! (విమర్శించి) కటకటా! నాహృదయం బిటులేల కామవికారపరవశం బయ్యెను. నా కీవిషమకళంకభా వం బెన్నఁడైనఁ గలిగెనే? ఋతుకాలంబులఁ గాక భోగేచ్ఛ నామది జనియింప నేనేమిపాపముచేసితినో కదా! మదనా!

నీవు నాపై నేడేల నింతవిరోధముం బూనితివి ! ఆహా ! మన స్సు స్వాస్థ్యముం జెడి- మోహావిభ్రాంతమగుచున్నది. మహాత్ముండగు పార్వతీశ్వరుని సేవాలాభమున, నాకలవడిన సునీతి యంతయు నేమయ్యె......చిత్తమా ! నిర్మలవగుము- మన్మథా ! నీకు జోహారు ! దూరము పొమ్ము. దూరము పొమ్ము.

(31 అనుబంధము.)

(మూర్ఛిల్లును.)

మన్మ—ఈతరుణి మూర్ఛనందియున్నది. ఇప్పుడు నే నత్రిమునిరూపమున నీసతికిఁ గాన్పించిన నాప్రభావమున మోహభ్రాంతయై యున్న యీనెలంతి సులభంబుగ నాకరబంధములం జిక్కుపడఁగలదు. అప్పుడు మాయమ్మ మనోభీష్టము నెరవేరును.

(అత్రిమునిగ మారును.)

అన—(కన్నులు దెఱచి) హా! ఏమి యీవేదన! (మన్మథుంజూచి విభ్రమముతో) నాథా ! నమస్కారము ! ఏమిది తమ రిట్లు తపంబుమాని వచ్చితిరి ?

మన్మ—జీవితేశ్వరీ ! నీ మనఃబు నేఁడు మదనబాణవశీకృతమై నాయందుఁ దవిలియుంట దివ్యవీక్షణముల నెఱింగి నిన్నానందాంబుధి నోలలాడింప నిందువచ్చితిని. మృణాళసమంబులగు నీ బాహువల్లరులచే తమిదీర నన్నొక్కమారు కౌఁగలింపుము.

అన—(తనలో) ఏమిది ? నాథుని నోటివెంట నెన్నడును వెలువడని తుచ్ఛవాక్యములు వచ్చుచున్నవి.

చ. గురుతరయోగనిద్రను దగుల్కొని యీశ్వరపాదసేవ నే
మరక దురంతపాపఫలమార్గమునైన యిహంబు రోసి, దు
స్తరతరమోక్షరాజ్యఘనసంపద గోరిననాథుఁ డీగతిఁ
బరువిడి కాములో లుఁడయి వచ్చుట సంశయహేతు వయ్యెగా.

మన్మ— దేవీ ! నిరుత్తరవై దురంతచింతం దవిలియుంటి వేల ? నేను నీ నాథుఁడను గానా ? నీకుంగూర్చు నతిని గానా ? నాకై కామజ్వరపీడితవై మిగులఁ బరితపించితివే? ఇప్పు డీతటస్థభావ మేల ? ఈతడ వేల? రయంబున కామలీలావిలాసంబులం దేలి సుఖింతము రమ్ము.

అన—(తనలో) నేనునిక్కముగ పొరబడితిని. భగవానుఁడగు నాపతి నోట నిట్టిపలుకు లెన్నడును రాఁజాలవు. వీఁ డొకానొక కపటశీలుండెవ్వఁడో యగుట నిజము. కటకటా! నే డెట్టిపాపపు వేళ నిద్దురలేచితిని. పరపురుషు నొక్కరుని నాథాయని పిలిచితినే! ఇది నర్మదాదేవితోడ నే నాడినభాషణంబులకు ఫలమైయుండనోపు. పాపము శాంతించుఁగాక! పాపము శాంతించుఁగాక!

మన్మ—దేవీ! అనసూయా! నామనంబు సయితము నే డేలనో నీపై మిగుల భ్రాంతిం దవిలియున్నది. నాహృదయతాపముం బాపుము.

అన—ఛీ! ఛీ!!—దుష్టుఁడా! కపటమతివై— నన్నుఁ బరిభవింప నా నాథుని రూపమున వచ్చిన నీవెవ్వండవో తొలుతఁ దెలుపుము. కాదేని, నీపాపఫలం బనుభవింపఁగలవు.

(32 అనుబంధము.)

మన్మ— ఆఁ!—ఆఁ!—చెలీ! ఏమిది? ఏల నిట్లు తీవ్రముగ మాటలాడెదవు? నెలంతా ! కలఁతపడిన నీయలంతఁ దీర్పవచ్చిన, నన్నలంతిసేయుట నీకు హితవా ! ఈదీనజనునిపై నీకృపామృతము వర్షింపవేల?

గీ. చిరతపః పరతంత్రత ఁజిక్కి—దీర్ఘ
మగువియోగంబునఁ గృశించినట్టి తనువు

# చతుర్థాంకము.

తరుణి! నీకృపామృతదోహదమున గాదె
నూతనానూన చైతన్యపూత మగుట!

అన— (తనలో) ఈదుష్టుఁ డింకను తనదుర్భావములు మానకున్నవాఁడు. ఇఁక నాలసించితినేని మహాపాయము రాఁగలదు. (అంజలి ఘటించి) ఓదేవా! విపన్నజనసంరక్షకా! ఈ దురంతార్తికరసమయమున నామానసంరక్షణం బొనరింప కర్తవు నీవేకదా!

సీ. పతితపావనియైన భాగీరథి భవత్ప్ర
భావమూలమునఁ గాపాడఁబడియె
భూతనిర్మాతయగు నాతతాయికి, నీప్ర
భావంబుననె గర్వభంగమయ్యె
కంఠపాశంబైన కాలసర్పము నీప్ర
భావంబుననె సుమహారియమయ్యె
పతితుఁడౌ నర్మదాప్రాణేశ్వరుఁడు నీప్ర
భావంబుననె లబ్ధజీవియయ్యె
నిపుడు నాజీవితేశునాకృతి వహించి
వచ్చియున్నాఁడు వీఁడు పాపాత్ముఁ డెనఁడో
భరము లగు నీవిపత్పరంపరలనుండి
నన్ను గాఁపుము దేవ! మాన్యప్రభావ!!

ఓ జగద్రక్షకా! మానినీమానసంరక్షకా! నేను పతిపాదములు దక్క నితరము స్మరింపనేని — నాపతి తపఃప్రాబల్యమున నీ కుటిలునకు నిజాకృతి గల్గుఁగాక !

(జలంబులు చల్లఁగా మన్మథునకు నిజాకృతి గల్గును.)

మన్మ— హా సతీ! అనసూయా! నేను మన్మథుఁడను నీపతిని గాను. పాపాత్ముఁడనైన నన్ను రక్షింపుము.

(శిశి అనుబంధము)

అన—ఓరీ! దురాత్మా! మదనా! నిన్ను క్షమింపఁగూడదు. ముల్లోకంబులు నీవలన నుల్లోలకల్లోలంబు లగుచున్నయవి. సంఖ్యాతీతంబులగు సంసారంబులు నీవలన దగ్ధపటంబులయ్యె. మగువ లెందఱు నీమూలమునం గులటలైరో?—మహామును లెందఱు నీమూలమున, మదనలోలురై—తమ తపంబులకు దిలోదకంబులను వదలికొనిరో—కనుగొనని యౌవనంబునఁ జిక్కిన యువజను లెందఱు నీమూలమున వేశ్యాలంపటతం దవిలిరో లెక్కయున్నదా? ఓరి దుష్టుఁడా!—

గీ. పొగరు తల కెక్కి కన్నులఁ బొరలు గ్రమ్మ
యెదను సదసద్వివేకవిహీనుఁడ వయి
సంచరించెదు సాధ్వులఁ గాంచ లేవొ?
నీకనులు గానరావొ రమాకుమార.

మన్మ—హా! దైవమా! నాకన్నుల కేమియుఁ గనఁబడుట లేదు. సతీ అనసూయా! భయంకరశాపంబులై నీయాలాపంబులు నా కధోగతిం గూర్చినవి. నా కనులకుఁ బ్రకృతియంతయు ఘోరాంధకారసమాక్రాంతమై తోఁచుచున్నది. నా సహస్రదోషంబులను క్షమింపుము. నీపాదంబులం బడితిని. నీమహాసాధ్వీత్వ మెఱుంగలేక—ని న్బరాభవింప వచ్చినందులకుఁ దగిన ఫలంబుఁ గంటిని. దయాభరితవగు నీకు దీర్ఘంబగు క్రోధం బనుచితము—శాపోపసంహార మొనరించి రక్షింపుము—

చ. తెలిసె భవన్మహామహిమ దీనుతదివ్యపవిత్రశీల నీ
యలఘుపతివ్రతానుమతి కంబుజనాభముఖాదిదేవనా
థులు వెఱగందు టబ్బురమె? దుష్టుఁడ నన్ను క్షమింపు మన్నదున్
నలువఁగ సాహసింపను, భుజంగకరాళముతోడ క్రీడలన్.

అన—అయ్యయ్యో! నా కిదియొక యపచార మెటులఁ గలిగెను?

మదనా! నీవొనర్చిన దుష్కృత్యమున కలుకగలిగిన నే నటు లంటినిగాని—నేను శపియింప నెంతటిదానను! నీ పాపసంకల్పంబువలననే నీవు—దృష్టిహీనుడవైతివని తోచుచున్నది. పరమేశ్వరుడు నీకు రెండియు దృష్టిం బ్రసాదించునుగాక!

సీ. పద్మాలయామాతపఃఫలవిశేషంబునఁ
బ్రియనందనుండవై వెలసినావు
హరునిఫాలాగ్నిలో నడఁగి భస్మంబయి
రతితపోమహిమచే బ్రదికినావు
వ్యాసాదిసంయమీశ్వరుల నంతటివారి
నీయాజ్ఞలోపల నిలిపినావు
పలచేతిబాణగణంబులరీతి నఖిలలో
కంబుల నాడింపఁగలిగినావు
నిఖిలసృష్టికి మూలమై నెగడినావు
కువలయముల కానందంబుఁ గూర్చినావు
మారుఁడా! ధీరుఁడవు; నీకు మహితముగ, జ
గత్పతికృపాప్తిచే దృష్టి గలుగుగాక.

(నిష్క్రమించును.)

మన్మ—(దృష్టిగల్గి) ఆహా! ఏమి యీసతి సతీత్వమహిమ! నిగ్రహానుగ్రహసమగ్రసమర్థురాలయి నాకు మరల దృష్టిం బ్రసాదించినది. మా యమ్మమాట విని మిగుల నవమానింపఁబడితిని గదా! 'స్త్రీబుద్ధిః ప్రళయాంతకః' యను నార్యోక్తి రిత్తయగునా?

సీ. తనయునిఁ బాపి యుత్తానపాదుం డేడ్చె
వెలదులదుర్బోధ వినుటచేత

పుత్రశోకార్తుఁడై పొలిసెఁ బంక్తిరథుండు
వెలదులదురోఁభ వినుటచేత
దశకంధరుండు సంతతులతో నశియించె
వెలదులదురోఁభ వినుటచేత
కౌరవులనే రుక్మాంగదుండు చంపఁబాల్పడె
వెలదులదురోఁభ వినుటచేత

గీ. స్త్రీలదురోఁభలను చెవిఁ జేర్చుకతన
నీజగతి నెంతవారు నశింతురిగాన,
సులభగతిఁ బ్రిశయాంతంబు సలుపఁజాలు
వెలఁదిబోధకుఁ జెవి యొగ్గవలదు - వలదు.

(నిష్క్రమించును.)

తెర వ్రాలును.

ఇది చతుర్థాంకము.





శ్రీ

# పత్నీపరితాపము

అను

# అనసూయానాటకము.



పంచమాంకము.



1 వ రంగము—అనుభవానందునియిల్లు.

[అర్ధరాత్రిమున అనుభవానందుఁడు ప్రవేశము.]

అను—ఈ వేళసాయంత్రం సత్యనారాయణవ్రతానికి వెళ్లేటప్పుడు మా దేవిగారితో చెప్పలేదు. ఈ రాత్రి నా ప్రారబ్ధ మెలా వుందో యేమిటో? పోనీ! అక్కడి హరికథయినా తెల్లవార్లూ వుంటే బ్రదికిపోదును. తెల్లవారడాని కింకా యెంతో ప్రొద్దుంది, ఈ రాత్రి నే నెక్కడికి బోదును? శీతగాలి గూడా రివ్వురివ్వున వీస్తూంది. ఇరుగు పొరుగు వారంతా నిద్ర బోతున్నారు. ఒకవేళ మా దేవిగారు నా నెత్తిన నాలుగక్షింతగింజలు నా నెత్తిన వేసినా చూచేవా రుండరు. ఏదో వొకల్లరి యీ రాత్రే నడిచిపోతే సరిపోతుంది. (ప్రకా) ఇదుగో!—ఓయ్!—మా యింట్లోవాళ్ళూ—మా యింట్లో వాళ్ళూ—వసే—మా పిల్లలతల్లీ—తలుపు—తలుపు—

[సోమదత్తుఁడు ప్రవేశము.]

సోమ—అర్ధరాత్రి యెవ రాకేక వేసేది?—

అను—ఆఁ!—సోమదత్తుఁడుగారా! నేనే నండి! మా వాళ్లని నిద్ర లేపుతున్నాను.

సోమ—ఎవరది?—అనుభవానందుఁడుగారా?

అను—ఆఁ! ఆఁ!—నేనేనండి?

సోమ—ఇంతరాత్రివేళ మీరెక్కణ్ణుంచి వస్తున్నారు?

అను—ఒకరింట్లో—హరికథా—సత్యనారాయణవ్రతమూ అవుతూ వుంటే—వెళ్లొచ్చానండి.

సోమ—చాలా పొద్దుపోయింది. మీ యావిడ నిద్రబోతున్నారా యేమిటి?

అను—ఆఁ!—అలాగే తోస్తూంది—మేలుకొనే వుంటే పిలిచేపిలవడంతోటే లేచేవుండును. (స్వగ) నిజంగ మేలుకున్నా నా మాట విని నిద్రబోతుంది. (ప్రకా॥తలుపుతట్టి) ఇదుగో! ఓయ్!! నా పిల్లలతల్లీ! వినబడుతూందా కొంచెం తలుపుతియ్యి (స్వగ) నా పిల్లలతల్లి గాదు— పిశాచాల తల్లి.

కర్క—(లోపలనుండియే) ఊఁ!— ఊఁ!!—వినబడుతూంది—వినబడుతూంది—ఇంత రాత్రివేళ నువ్వెక్కణ్ణుంచొచ్చావు? ఇంతసేపేముండింట్లొ చచ్చావు?

అను—రాక్షసి లేచిందిరా దేముఁడా!

కర్క—ఏమి? నోటినుంచి మాట పెకలదేం? జవాబు చెబితే నోరు పడిపోతుందా యేమిటి?

అను—నే నింతవఱకూ హరికథలో వున్నాను. ఇప్పటిదాకా విన్నాను.

కర్క—బాగానేవుంది. నీవు రాత్రింబగళ్ళు హరికథలు వింటూవుండు. సంసారం—కొంప—గోడీ—అంతా గంగలో గలసిపోతుంది. నువ్వ కొంపకొంపకూ తిరిగి యింతంతరాత్రి కొస్తూ

వుంటే— నేనీచలిలో లేచేదాన్నిగాను. తలుపు తీసేదాన్ని గాను.

అను —నీకు పుణ్యముంటుంది —చలిలో చస్తున్నానే! నీగడ్డంబట్టుకొని బ్రతిమాలుకుంటాను. చలిగావుంటే పచ్చడం గప్పుకొని వొక్కమాటు లేచి తలుపుతీతూ?

కర్క——చాలుచాలు —అట్టె కేకలు వేయకు — ఇప్పటిదాకా యెక్కడుండొచ్చావో అక్కడికే వెళ్లు—ఆచలిలో గడగడ వొణికి కుళ్ళు—

అను —ఓదేవీ! ఈవేళకు నన్ను క్షమించు— తలుపుదీస్తివా లోపలి కొస్తాను. తియ్యకపోతివా చలిలో నీధర్మాన ప్రసూరుమని చస్తాను.

కర్క——చాలు—నీలుగు — బూటకెయిపో—నేను నీకోసం అర్ధరాత్రి తలుపుతియ్యటానికమాత్రం కనిపెట్టుకొని సిద్ధంగా వుండలేదు. నేను నిద్రలేకుండా చస్తూవుంటాను. నువ్వు కొంపలవెంబడి దిరిగి ఆనందం అనుభవిస్తూవుండు—ఇప్పుడు తలుపు తీసేదిలేదు. నీయిష్టం వచ్చినచోటికి వెళ్లు.

అను— నేనేకొంపలవెంట వెళ్లానే?—ఆట్లాతిడతావు—బ్రాహ్మణ కొంపలోబుట్టి సత్యనారాయణవ్రతానిక వెళ్లడమేతప్పా— అందుకని నాకీముప్పా?—

కర్క——బ్రాహ్మణకొంపలో బుట్టానని యేడుస్తున్నావుగదా బ్రాహ్మణధర్మమంటే యిదేనా? అర్ధరాత్రి యింటికొచ్చి నిద్రపోతున్నవాళ్లని లేపి అల్లరిచేయటం—ఏసుఖంలేకుండా క్షోభపెట్టటం—

అను—ఇదుగో! ఇంటిదానా—నీకోసం సత్యనారాయణప్రసాదం గూడా తెచ్చాను. ఇదివొద్దంటె కళ్ళుపోతవట! సత్యనారా

యణమూర్తికి కోపంవస్తుందిట!

కర్క—నారాయణమూర్తికోపానికి భయపడేవాడెప్పు- ఇప్పు డిక్కడ లక్ష్మీదేవి కోపపడుతుంది- దేనికి చస్తావో చావు.

అను—పోనీ! కోపంమాటకేమిలే! కమ్మగావుంటుంది—గోధుం పిండీ! నేత్తో వొండింది—కొంచెంతిందువుగాని—తలుపుతియ్యి.

కర్క—నాకిప్పుడు ప్రసాదమూవొద్దు సింగినాదమూవొద్దు—కమ్మ గా నువ్వే తిను.

అను—దేవుడిప్రసాదం వొద్దంటారటా! ఇట్లా దేముణ్ణి అనాదరణ చేస్తే—తుద కేగతిగలుగుతుందో తెలుసునా?

కర్క—ఆ! ఆ!!—ఏగతిగలుగుతుందో తెల్లవారనియ్యి—చెపుతా—

సోమ—శాస్తుర్లుగారూ! ఈవేళ గడియలేం బాగున్నట్టు లేదు—మా ట్లాడక పుస్తొర్యంపరుచుకొని అరుగుమీద కృష్ణకృష్ణా అని పడుకొని తెల్లవార్చండి—ఒకవేళ మీరు బలవంతంమీద త లుపుతీయించుకొని లోపలికివెళ్ళినా సుఖపడరు.—నామాట వినండి.

అను—ఇలాగేవుంది నాయనా! ఇప్పుడు నేనేమీ నోరు విప్పేటట్టూ లేదు—మాట్లాడేటట్టూ లేదు.

కర్క—తలుపు దియ్యమని నాప్రాణా లెందుకుతీస్తావు—చలిలో నీప్రాణాలే తీసుకో.—

అను—భగవంతుడా! నన్నింతె చేశావా? చలిలో గుమ్మందెగ్గఱ చావమని రాశావా?

(అరుగుమీద కూర్చుండును.)

కర్క—'చావమనిరాశావా!' అని వూరికేయేడవకుంటే చావరాదూ వొకసారి?

అను—తొందరపడకు- తొందరపడకు- తుదకలాగే జరిగేట్టుం

దిలే—కొంపచదలి పారిపోవడమో గొయ్యో- నుయ్యో-చూచుకోవడమో—ఎలాగూ దేముఁడు రాశే పెట్టాడు.

కర్క—అయితే—ఆపని యింకెప్పుడో కాదు. ఈవేళ మంచిలగ్నం గుదిరింది—శీఘ్రిగాపారిపో—వెళ్లనారితే మళ్ళి శనివారం దుర్ముహూర్తమొస్తుంది—పారిపోవడాని కిష్టం లేకపోతే—దొడ్లో నూతినిండా నీళ్లున్నాయి పోయిపడు.

సోమ—నొదినెగారూ! చాలాసేపే శిక్షించారు. ఇంక పోనియ్యండి—లోపలికి రానియ్యండి.

కర్క—ఎందుకూ? ఎందుకురానిస్తారూ? నువ్వెవఁడవ్రా? మాగొడవలన్నీ నీకెందకూ? నామగణ్ణి కోపమొస్తె కొట్టుకునేదాన్నీ నేనే—ప్రేమొస్తే పెట్టుకునేదాన్నీ నేనే—నీవేమో డబ్బుగలవాడవని నేను మన్నించను. జాగ్రిత్త—విశేషంగా వాగితివా—నువ్వుగూడా విచారపడవలశొస్తుంది.

అను—అన్నా! మీరేమీ మాట్లాడకండి బాబూ! మర్యాదంటే యేమిటో యెఱుగదు. మీరుమిక్కిలిగావొస్తే - మీనెత్తిమీదగూడా పెద్దబండ బడేస్తుంది.

కర్క—ఏమిటే? నేను మర్యాదెఱుగనిదాన్నా? (జవాబు చెప్పక ముందే) ఏం? మాట్లాడవేమీ? గొంతుక బిగుసుకపోయిందా! ఆడదాన్ని తిడుతున్నావు. నీకు సిగ్గులేదూ! నీనాలికె కాలిపోవడంలేదూ! భయ్! బండపడేస్తుందిగా! ఆఁ!—బాడ పడేస్తుందిలే.

అను—అన్న ప్రితిమాటకూ తప్పుపట్టుకోకే!—ఈసారి వొక్కసారీ బుద్ధిపొరపాటయి నీతో చెప్పకుండా సత్యనారాయణవ్రితానికి వెళ్లానే! ఆలశ్యంగా యింకెప్పుడూ రానే! రానే! మంచిదానవుగాదూ!

కర్క—ఆలస్యంగా యెప్పుడూ రానని వొట్టుపెట్టుకుంటివా లోపలికి రానిస్తాను. (జవాబు చెప్పకముందే) ఏమి? నోరు పడిపోయినట్టుందే! పళ్ళు బిగుసుకొనిపోయినట్టున్నవే—ఆమాట నడానికి సిగ్గవుతూందికాబోలు!

సోమ—సిగ్గుమాత్రి మవుతూనేవుంది! పళ్లుగూడ చలివల్ల బిగుసుకొనిపోతూనేవున్నవి. పోనియ్యి. ఇవ్వాళటినుంచి ఆలస్యంగా రాడుగాని లోపలికి రానియ్యి—

కర్క—ఆఁ!—నువ్వు చెపితేనే—నేను తలుపుతీసేది—నే నంత వెఱ్ఱిబాగులదాన్ని కానులే.

సోమ—అబ్బో! నువ్వు వెఱ్ఱిబాగులదాన వెందుకవుతావు? నీవు లోకాన్నంతా చేబిక్కించుకొనే పిడివి! అరుభవానందుఁడు వెఱ్ఱిబాగులమనుకొనకు' లేకుంటే నీకు భయపడతాండా? నేనైతే—నీమరదకు బాగా నూరు మప్పించివుందును.

అను—సోమదత్తుఁడన్నా! నువ్వు మధ్య నేమీ చెప్పకు. నీ గొంతుకకూడా కొరికేస్తుంది.

సోమ—నే నీవెతంగో తీరుబడి చేసుకొని పోట్లాడడానికే వొచ్చానా అన్నా?

కర్క—నువ్వు తీరుబడి చేసుకొని రాకపోతే—నేను నీయింటికి తీరుబడి చేసుకొచ్చానా?

సోమ—నిజం—నిజమమ్మా—నీ కాపాటి తీరుబడేవుంటే తలుపే తీసుందువు—

కర్క—నేను తలుపు తీస్తాను తియ్యను—అదంతా నీ కెందుకు? నువ్వేమయినా పంచాయతీ చేస్తావాయేమిటి?

సోమ—లేదులేదమ్మా! నీమీద నేనేమీ పంచాయతీ చెయ్యడం లేదు—నా కెందుకు? నేను వెళతాను. (నిష్క్రమి॥)

కర్క—ప్రతిరాత్రి అర్ధరాత్రి తిరిగి తిరిగి కొంప చేరడం గాకుండా

యిసుగుపోసు నీవాళ్ళను నామీదికి కుక్కల్ని వుసిగొలిపినట్టు వుసిగొలుపుతున్నావా? నీ కృతఘ్నతనం గంగలో కలవ! చలిలో చస్తున్నానని— పోనీ తలుపు తీద్దామనుకుంటూ వుంటే— నా ప్రాణ్ని మరీ తీస్తున్నావా? నీరోగం కుదురు స్తాను ను—ఇప్పుడు బాగా చలిలో చావు—

(చెంబులో చన్నీళ్ళు నెత్తినబోయుచున్నది.)

అను—(వణకుచు) ఉహు—హు—హుఁ—హుఁ—హుఁ—హుఁ హుఁ—హస్తే భగవానుండా! శనినీజాతి రాక్షసముండా! చన్నీళ్ళు—చలిలో అర్ధరాత్రి మొగుడి నెత్తిన దిమ్మరిస్తావా చండాలపు పిశాచముముండా!

[సోమదత్తుని ప్రవేశము]

సోమ—అనుభవానందనా! ఏమిచేసిందేమి? నెత్తిమీదేమయి న గుమ్మరించిందా?

అను—బాబూ! ఏమి చెప్పమనేది? ఇందాకటినుంచీ—మెఱుపులు మెఱిసి—ఉరుములురిమి—తుదకు వర్షంకూడా కురిసింది!

సోమ—ఏమిటీ? లోపలినుంచి నీళ్ళుపోసిందా? అరే—అరే—అన లే చలిలో చస్తూంటే చన్నీళ్ళస్నానం చేయించిందీ! దీనికి కొత్తిగా సిగ్గు లేనట్టున్నదే!—

అను—నారాయణ—నారాయణ ఇప్పుడు నా గతేమిటి? గుడ్డ లన్నీ తడిసిపోయినవే!

సోమ—సరే! విచారిస్తే లాభంలేదు. ఈరాత్రికి మాయింటికిరా— పొడిబట్టలిస్తాను. అక్కడే పడుకుందువుగాని.

అను—అన్నా! నేనీ ముండతో యిక వేగలేను; తిన్నగా వెళ్ళి అనసూయాదేవి కాళ్ళమీద పడతాను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

2 వ రంగము—వైకుంఠము.

[లక్ష్మి, సరస్వతి, పార్వతి ప్రవేశము]

పార్వ—సఖీ! ఇందిరాదేవి! ఈ యనసూయం బరిభవించుట మనకుఁ గష్టసాధ్యమై తోఁచుచున్న దేమి?

సర—నారదునిమాటలు నిజము లగునేమో—

లక్ష్మి—అట్లయిన నిప్పు డేమి చేయుదమని మీసంకల్పము?

పార్వ—మనపతులచే నైన నీ పరాభవముం జేయించి తీరవలయు నని నా సంకల్పము.

లక్ష్మి—సఖి! నీవు చక్కని యాలోచన చేసితివి. మన మాయన సూయ నేవిధముననైన—నవమానింపక మిన్నకుంటిమేని—త్రిదేవు లసమర్థులనియు—నొకమానవాంగనకు పాతివ్రత్యమున నోడిరనియు లోకంబు లన్నియు నాడిపోసికొనును. ఈవార్త ను నారదుండు పెద్దఁజేసి మనలను దుష్కీర్తిపాలు చేయక పోఁడు. అందువలన మనకుఁగల గౌరవము పూర్ణముగ నశియించిపోఁగలదు. నేను నాపతిని, నయముననో—భయమున నో బలవంతపఱచి ప్రయాణముచేసెదను. మీరునయితము మీపతులను వెంటఁబెట్టుకొని యిటకు రండు.

పార్వ—ఈయాలోచనము సమంజసముగ నున్నది.

లక్ష్మి—అదిగాక—చెలులారా! ఇందువలన నొకమంచి—మేలు గలుగఁగలదు. మన మనసూయను పరీక్షించి విఫలహృదయ లమైన సంగతి మనపతులు విని మనల నాక్షేపింపక పూర్వమే వారిని మనము పంపితిమా—వా రనసూయను పరాభవించిన మనకార్యము నెరవేరును. అట్లుచేయలేక వారే పరాభూతులైవచ్చిరా—యాపయిన మనలం బరిహసించువా రుండరు.

పార్వ—ఈయాలోచనము నాకిప్పుడు చక్కగా నచ్చినది.
సర— దీనియందింత యుక్తిగలదని నేనిదివఱ కనుకొననేలేదు.

[తెరలో]

అమ్మా! ప్రభువుగారు వచ్చియున్నారు.

లక్ష్మి—చెలులారా! నానాథుఁడు వచ్చినాఁడు. మీరింక మీ పనులయం దప్రమత్తలై మెలంగుఁడు, పొండు.

సర } అట్లే చేయుదుము.
పార్వ } (ఇద్దఱు నిష్క్రమింతురు.)

[విష్ణువు ప్రవేశించును.]

లక్ష్మి హృదయేశ్వరునకు జయము—

విష్ణు—కల్యాణీ! మంగళమగుఁగాక!! నేఁడు నీవదనపద్మము తీవ్రాలోచనమును సూచించుచున్న దేమి?

లక్ష్మి—నా యాలోచనల కేమిగాని—నేఁడు తమకింత యాలస్యమగుటకుఁ గారణ మేమి? భక్తరక్షణకార్యములు ప్రబలమయ్యెనా?

విష్ణు—సదా యున్న భక్తరక్షణమే—నేఁడు క్రొత్తయేమి?

లక్ష్మి—నేఁడేదియో విశేష మున్నట్లున్నది.

విష్ణు—నేఁడు భూలోకమున పుణ్యాత్ముఁడగు నత్రియను మహర్షి—పుత్రదాన మపేక్షించి నన్నుంగూర్చి ఘోరతపం బాచరించుచుండ—నాతని గర్భమున నేనే జనియింతునని వరం బిచ్చి వచ్చితిని: ఆలస్యమున కిదియే హేతువు.

లక్ష్మి—అత్రి యన—ననసూయయను తపస్విని భర్తయేనా?

విష్ణు—నిజము పల్కితివి. అత్రిముని మహాసాధ్వియగు నాయనసూయ హృదయేశ్వరుఁడు—ఆమె పాతివ్రత్యమహిమంబును నీవుసయితము వింటివా?

లక్ష్మి— మీరు విని మెచ్చుకొంటిరిగదా! ఇంకనేమి? నేను వినన క్కఱలేదు.

విష్ణు— దేవీ! అట్లనుచుంటివేల?—ఆమె సాధ్వీశిరోరత్నమట గదా!

లక్ష్మి—చాలుఁజాలు— మానవాంగన సాధ్వియను మాట నేడు వింటిని.

విష్ణు—సతీమణీ! మానవాంగనలందు సాధ్వులే లేరా?

సీ. దశకంధరుని నీఱు నశియింపఁ జేసిన
దిందిరా! నరజన్మమందు గాదె?
నాకైన సాధ్యముగాక క్షీరనిధిఁగన్న
తులసి మానవసతీతిలక గాదె?
పతిజీవములు ప్రేతపతినుండి గైకొన్న
సావిత్రి నరయోనిజాత గాదె?
అలకిరాతుని భస్మముగ నక్కొనర్చిన
దమయంతి మానవతరుణి గాదె?—
భర్తృసత్యవ్రతంబుఁ గాపాడినట్టి
చంద్రమతి మర్త్యలోకసంజాత గాదె?
పుడమిలోననె సాధ్వులు పొడమరేని—
యెచట పొడమినవారు వచింపఁగలవె?

లక్ష్మి—మీ దష్టస్వభావము బోధించుకొంటిరి కారు గదా!— ఎప్పుడు చూచినను పొరుగింట పుల్లకూరయే మీకు రుచిగానుండును. భూలోకకాంతలు సాధ్వులన్నమాట కర్థము మేమందఱ మసాధ్వులమనియే, కాదా?

విష్ణు—దేవీ! అట్లెవ్వరు చెప్పిరి?

లక్ష్మి—మీమాటల కింతకన్న నర్థమేమున్నది? ఔను. మానవాం

గనలవలె— పాతివ్రత్యపటిమను సంగ్రహించుకొనునంతటి సామర్థ్యము మాకెక్కడిది ?

గీ. పరునితో మారసంగ్రామపరతఁ దవిలి
తులసివలెఁ బతివ్రతలలోఁ గలియఁగలమె ?
శతమఖునితోడఁ గూడి పాషాణమయ్యు
నాయహల్యపోలిక కీర్తి నందఁగలమె ?.

భూలోకాంగనలవంటి సమర్థత మాకెక్కడనుండి వచ్చును ?

విష్ణు—అబ్బ ! మీరు పతివ్రతలు గారన్నవారెవ్వరు ? నీకెందులకీ యకారణాగ్రహము ? మాటవరుస కనసూయ పతివ్రతయటసుమా యన్నంతనే మండిపడెద వెందులకు ?

లక్ష్మి—ఔను. నా స్వభావము కొలఁది మండిపడెదను. నేను పతివ్రతను గాను. క్రోధస్వభావను. ఈర్ష్యాపరవశను. మీకుం సతిగా నుండుటకుఁ దగను. ఇట్టి దానితో మీకేమి మాటలు? చాలు చాలు— మీ యనురాగబలము నేఁడు బాగుగఁ దెలసినది !

విష్ణు—దేవి !—నే నేమంటినని నీ వింతగా నాగ్రహింతువు ?

లక్ష్మి—నాతో మాట లాడకుఁడు.

(అనుబంధము 34)

(కోపమున దూరమున నిలుచుచున్నది.)

విష్ణు—ప్రాణనాయకీ ! నేను నిన్నేమియుఁ దృణీకరింపలేదు. స్మరచాపసన్నిభంబులగు కనుబొమల ముడిచి నాకు వెఱపు గలిగింపకుము. నీవు కోరిన కోరిక యెట్టిదుర్ఘటంబైనదైనఁ దీర్చి నినుఁ బ్రసన్నురాలిం జేసికొందును. నాపై నలుగకుము.

లక్ష్మి—అబ్బ ! శుష్కప్రియములు— శూన్యహస్తములు ! ఇట్టి సమయమున నెన్ని యిచ్ఛకములైన నాడఁగలరు— ఈ పాటి

యనురాగమునకు నే నడుగుట.— మీ రిచ్చుట కూడనా ?

విష్ణు—దేవీ ! నీ కీసందేహ మేల? ఎన్నడు నీ వడిగినది నే నీయలేదు? నాపలుకున కన్యథాత్వ మెన్నడైన జరిగెనా ?

లక్ష్మి— ఆ ముచ్చట నేడు తీరనున్నది లెండు.

విష్ణు—ఏ ముచ్చట ?

లక్ష్మి — నే నడుగుట—మీరు లేదనుట.

విష్ణు—ఆ !—ఆ!!—అంతిమాలయే ! అట్లు జరిగినని నీ కీ జాడ తోడ నన్నుం బరిహాసించినంత యెట్లు.

లక్ష్మి—అట్లయిన నడిగెద ?

విష్ణు —అవశ్యము—ఇంకను సందేహమా ?

లక్ష్మి—ఆయనసూయ నేవిధముగ నైన సాధ్వి కాదనిపించి రావల యును. ఇదియె నా కోరిక.

విష్ణు—సఖీ ! ఏమి యిది ? ఇట్టి కోరికఁ గోరితి వేమి ? పెద్దపులిమీ సములతో నుయ్యాల లూగవచ్చునా ?

లక్ష్మి— పెద్దపులి యైన మీరు సింహాసూప మున్నదిగాదా?

విష్ణు— దేవి ! అనసూయయన్న నేమనుకొంటివి ! ఆసాధ్వి మహాత్మ్య మున కెంతవారైనఁ దిరుగు గలదా ? ఆ పతివ్రత యలుక వహిం చి శపించిన మన కింక గతులున్నవా? తొల్లి భృగుపత్ని శపి యించిన కారణమున నే కదా నే నిప్పటి కింకను నేబదో యవ తారముల నందుచునే యుంటిని.

లక్ష్మి—చాలును— వినది; ఎనకొన్నంత యైనది. ఈ ముచ్చటయుం దీరునని నే నప్పు డనినమాటయే కదా ! ఎందులకు వచ్చిన నాలుక !—ఒకనీతి యుండవలయు—ఇచ్చవచ్చినట్లు తొలుత వాగ్దానము చేయవచ్చును. వానిని నిలువఁబెట్టుకొనినప్పుడు గదా జన్మము సార్థకమగుట !—అసమర్థుఁడగు పతిని వాం

పథమభంగి యగునెడల నింకేమున్నది. ప్రాకృతమానవుల కన్న నీచవృత్తులను మెలంగిన మనలను సమవర్తి ఘోరనరక బాధలం బడవైచుట ధర్మహానియగునా? లోకులం దెంత పరిహాసకారణము!—నిష్ఠురనీచతమంబగు నీదుష్కార్యమె పరిహరనాహరము గాకున్నయది. పరమేష్ఠీ! పరమేశ్వరా!— మీయుద్దేశము లేమి?

బ్రహ్మ—జనకా!—మేముపుత్రి మీకలుషకార్యంబును గావింప ననుమతింతుమే? ఈనిష్ఠురసమస్యను మేము విడదీయఁజాలక యేకర్తవ్యనిర్ణయము నీపై నుంప నిటువచ్చితిమి. నీయభిమతం బెటులో యటులఁ గావింపుము.

శంక — నాసంకల్ప మదియే.

త్రిదేవులు— (35 అనుబంధము.)

లక్ష్మి—భారతి! భార్గవి! వింటిరే పీరి యాలోచనములను?— మనపాదాంగుష్ఠమాత్రంబయిన విలువసేయని యీయనసూయ మనకన్న ఘనభావంబుగలదని నిరూపించి నారదుండునవ్వి పరిహాసించి యవమానించుటయే కాక— నేటికి— నిరవశేషముగ—ప్రాణేశ్వరులచేత నయిత మవమానింపఁ బడితిమి గదా! ఇట్టి యధమజీవితంబునకన్న మరణంబు సర్వశ్రేయము కాపున, నేనింక బ్రతుకఁజాలను; నేను మాతండ్రి యగు సముద్రునిలోఁ గలసి ప్రాణములను బాసెదను. మీ మీప్రాణములం బాయు తెరవు లాలోచించుకొనుఁడు.

(పోఁబోవును.)

విష్ణు—(పట్టుకొని) కలికీ! ఎక్కడికి?

లక్ష్మి—నన్ను వదలుఁడు—ఎక్కడికైన. మీకేమి?

విష్ణు—బాలా! ఏందుల కింతసాహసము!—రమ్ము నీకోర్కెఁ దీర్చెద

ను.—(అపవారించి) శంకరా! చతుర్ముఖా!—ఇప్పుడు మన కేది కర్తవ్య మాలోచింపుఁడు.

బ్రహ్మ—(అప) నేను కింకర్తవ్యతామూఢుఁడనై యున్నాను.

శంక—(అప) నాకొక్కటి తోఁచుచున్నది.

గీ. పోయివత్త మాసతి యనసూయఁ జూడ—
నెప్పుడును గల్గ దాస్వార్థ కెట్టిపోక
చేరి తన్మహిమముఁ బరీక్షించి, వరము
లొసఁగుదము ప్రీతిగాఁగ మున్లోకములకు.

ఇందువలన వీరి యహంభావము నశింపఁగలదు.

విష్ణు—(అప) నాయుద్దేశము నదే యున్నది. (ప్రకా) దేవీ! నీవా గ్రహవిముక్తవు గమ్ము—మీకోరికప్రకార మట్లే యాసతిం బరీక్షించివత్తుము.

లక్ష్మి—నాథా! మీకమంగళము కలుగకుండుఁగాక!

పార్వ—దేవా! మీకశుభము గాకుండుఁగాక!

సర—ఆర్యా! మీకపజయము రాకుండుఁగాక!!

(త్రిమూర్తులు నిష్క్రమింత్రు)

లక్ష్మి—ఇక నారదుని పొగరణఁగఁగలదు—అనసూయమహాత్మ్య మిక లోక మెఱుంగఁగలదు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

3 వ రంగము—అత్రియాశ్రమము.

[అనసూయ ప్రవేశము.]

అన—(స్వగ)—అకటా! అనపత్యు లగువారి జన్మ మొకజన్మమా?

సీ. నవమాసములు మోసి భువి గాంచి పెంచి, డో
లికనుంచి యూపి లాలించునపుడు

గజ్జలందెలు మ్రోయఁ గాళ్ల కడ్డము వచ్చి
యెత్తుకొమ్మని చేతు లెత్తినపుడు
పొరుగింట నిరుగింట దిరిగి తిండికి రాక
వేసార మారాము వెట్టినపుడు
వెరపింప మదిలోన బిత్రిల్లి మొగమెత్తి
"యమ్మా" యనుచు జాలి నరయునపుడు

గీ. క్షితిని మాతాపితల కాత్మసుతుల పైనఁ
గలుగు వాత్సల్యమున కెంత విలువగలదొ?
తలఁపఁ దనువెల్లఁ బులకలు గలిగె నకట!
సమయమే సంతతులు లేనిజన్మ మవని.

భగవచ్చిత్రమేమో కాక—

ఆ. భ్రాంతి మొగము నాచి సంతాన మనియేడ్చు
జనుల కీశ్వరుం డొసంగలేఁడు—
కుడువఁ గూడు లేని కడుపేదవారి కొ
సంగుచుండు పుత్రశతము సతము.

పుత్రవాంఛచేఁ. బ్రాణేశ్వరుండు తపం బొనరింప నరిగెను—
త్రిమూర్తులం దెవ్వరైన దర్శనం బిచ్చిరో లేదో—మా
యదృష్టం బెటులున్నదో!—

[బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రవేశము]

త్రిమూ—భవతిభిక్షాందేహి—భవతిభిక్షాందేహి—భవతిభిక్షాం
దేహి.

అన—ఏమినా భాగ్యము! త్రిమూర్తులవలె—మహాతేజస్స్వరూపులై-
భవతిభిక్షాందేహి యనుచు పరమపవిత్రులగు నర్థులునన్నను
గ్రహించిరి. వీరి నర్చించినదే జన్మము—మహాత్ములారా!

ఈయాసనముల దయచేయుఁడు. తమ కాహారము లిడి య
ర్చింతును.

(నిష్క్రమించును.)

(త్రిమూర్తు లాసీను లగుదురు.)

విష్ణు—(అప) చతురాననశంకరులారా! పవిత్రస్వరూపిణి యగు
ఈసతీతిలకము నీక్షింపఁగనే— నామనంబు వైకల్య మందుచు
న్నది కాని యెట్లో స్థిరచిత్తుఁడ నగుదును. మన మిదివఱకేర్ప
రచుకొనినమార్గము మీహృదయంబుల జాగరితమైయున్నది
గదా! ఆవిధంబునఁదక్క వేఱువిధంబున నీమె సాధ్యముకా
దు. కావున నాసంభాషణప్రవర్తనాదులనే మీ రనుసరిం
పుఁడు.

అన—(ప్రవేశించి) (అనుబంధము 36)

[వడ్డించి ఔపోసనము పోయఁబోవుచున్నది.]

విష్ణు—సాధ్వీ!-ఒక్కనిముసము తాళుము— మావ్రతము నాలకించి
పిదప మాకౌపోసనం బిమ్ము.

బ్రహ్మ—ఆవ్రతము చెల్లినగాని భుజించువారము గాము.

శంక—ఆవ్రతముసయితము పేర్కొందు నాలకింపుము.

ఆ. విస్తరింపనేల? వెలఁదిరో వస్త్రరహి
హీన వగుచు నోసఁగుదేని, నీదు
సత్కృతులను గాంచఁ జాలుదు మటు లేవు
నేరవేని మఱలువార మమ్మ!

బ్రహ్మ—మావ్రతం బిదియే— ఇందుల కేవిధమైన నన్యథాత్వము
జరిగిన—పీటలనుండి యిట్లే లేచి పోవువారము.

అన—(చెవులుమూసికొని) హరిహరీ!— నేఁడెట్టి దుర్దినము! పుణ్య
స్వరూపులారా! మీ తేజమునకు — మీమహాత్త్వమున కీవ్రి

తం బనుచితము గాదా ? పవిత్రులగు బ్రాహ్మణుల కిట్టియా సురంబగు వ్రత బెట్లలవడియె — విగతవస్త్రయగు నాడు దానిచేతి యన్నంబుం గుడుచు నాచార మార్యజనోచితంబై నదియా పితృసమానులగు మీరిట్లు కోరరానికోరికం గోర— మీపుత్రికనగు నేనేమని పలుక సమర్థురాలను— వేదవేదాంగవిజ్ఞానులగు సజ్జనశ్రేష్ఠులే— అధర్మాచరణంబు నన్యాయముగ నాచరించుచుంటిరా ! ఇట్లు మీరొనరించిన— లోకంబు లాగునా! ధర్మాధర్మములకు భేదంబు గలుగునా? పరవనితామానభంగంబు పుణ్యకార్యమా? దుష్టులు మానవతులం బరిభవించుసమయములం బరిరక్షించి శాపాయుధంబున దుష్టశిక్షణశిష్టరక్షణంబు లొనర్పందగినవారు గదా !— ఇట్టివృత్తియందు ప్రవేశించితి రేమి ?— ఏయామయులారా ! నా ప్రార్థనం బాలకించి యీకట్టడిపట్టు మాని భక్తితో నిడు నా సత్కృతుల ననుగ్రహింపుడు.

మ. భువనాతీతము; త్వన్మహాత్మ్యము- మహాపుణ్యాత్ములౌ మీ, రసం
భవసంకల్పము సేయజెల్లునె ? కృపాపారీణులారా !— కటా !
యవినీతిక్షభరియింతురే మదుల— నన్యాయంబుగా సాధ్వులం
దవమానం బొనరింప లోకములు, విధ్వస్తంబు గాకుండునే?

అదిగాక- మహాత్ములారా !

గీ. అజగరం బౌచు నహుషుండు హతముగాడె
చెందడే వేయికనులు శచీధవుండు
సతులగోరుటం గాదె యీగతులు గల్గె
నెఱుంగరే మీరు ? గురుతపోనిరతులార !!

విష్ణు— సుదతీ ! ఈనీతులు మేమెఱుంగనివారము గాము. నీకు మా వ్రత మనుమతమేని నిలచి యాతిథ్యమును స్వీకరింతుము:—

కాదేని యిపుడే వెడలిపోవుదుము.

శంక—మాకోరిక దీర్ప నీకననుమతంబేని వేరొకవెలది నర్థింతుము లెమ్ము.

బ్రహ్మ—మిత్రులారా!— మన కీవెలదికతంబున మిగులం గాలాతీత మయ్యె— అపరాహ్ణముకాకమున్నె, వ్రతసపూర్తి గావించుకొని, భుజింపవలయు.

విష్ణు— ఓ వెలంతా! నీనీతుల నాలకింపవచ్చినవారము గాము. మా కోరిక దీర్తువా నిలతుము. కాదా! క్షణ మిందు నిలచువారము గాము.

అన—(స్వగ) అహా! ఇప్ప డేదిదారి? ఇది యీశ్వరపరీక్ష గాని వేరుకాదు— వీరు నా సతీత్వసత్వముం బరీక్షింప నరుదెంచిన త్రిమూర్తులని నామది సందేహము గల్గుచున్నది. కానిమ్ము. నా సాధ్వీత్వము నిష్కళంకమగునేని వీరి వాంఛకుం బ్రతివిధాన మిప్పుడే కావింతును. (ప్రకాశము) దయాసదయులారా! విప్రశిఖామణులైన మీ రింతటి దారుణకార్యంబున కుపక్రమించితిరి. ధర్మదేవతను నోరులేనిదానిం గావింప నూహించితిరి. కర్మసాక్షి కనులుగప్ప నుద్యమించితిరి. ఐనను భయములేదు— పత్నీవ్రతాపము నించుక మది నెఱుంగుదురు గాక! పరాత్పరుం డ ధర్మప్రతిపాలనం బొనరించు నను మాట నిక్కమేని— నా పతి పుణ్యాప్రవర్తనముగల మునిసత్తముండేని—నా సాధ్వీత్వము కళంకరహితమేని— నా శీల భంగము గాకుండగనే— మీ యభీష్టంబు నెరవేర్చెదను— మీ కాహార మొసంగెదను.

(అంజలి ఘటించి)

గీ. ఈశ్వరా ! ధర్మపాలనా! విశ్వనాథ !
పరమపావనులగు వీరి బాలకులుగ
సలిపి మచ్చిల మీనాడు నిలుపుమయ్య !
నీవు గా కన్యగతు లింక లేవు నాకు.

(నీరుచల్లగా త్రిమూర్తులు పిల్ల లగుదురు. అనసూయ వస్త్రవిసర్జనము చేయుచుండ తెర వ్రాలును.)

ఇది పంచమాంకము.





శ్రీ

# పత్నీ ప్రతాపము

అను

# అనసూయా నాటకము.



## షష్ఠాంకము.



### 1 వ రంగము—అనుభవానందుని యిల్లు.

[కర్కశ విచారముతో ప్ర॥]

కర్క—అబ్బా! ఆకలి—అయ్యో! ఆకలి—ఇప్పటికి తిండితిని మూడురోజు లయింది. ఇంట్లో గింజెడుబియ్యం లేవు. ఆయన వుంటే—ఏతంటాలుపడి తెచ్చేవాడో యింట్లో సమస్త పదార్థాలూ వుండేవి—ఆ రాత్రి గయ్యాళితనం జేసి చన్నీళ్లర్ధ రాత్రిని నెత్తిన బోశాను. ఎక్కడికి వెళ్ళాడో!—పదిహేను రోజు లయింది; జాడలేదు. నాకు కూడులేదు. అయ్యయ్యో! ఈవేళ మరీ లేవలేకుండా వస్తుందో యేమిటో—తలనొప్పి వేస్తుంది. లేస్తే కళ్లు గిర్రున దిరుగుతున్నవి. ఇరుగుపొరుగు వారితో నా యవస్థ చెపుకుందామన్నాగానీ—అందరితో యిదివరకే విరోధపడ్డాను. స్నేహితు లెవ్వరులేరు. ఉస్! అబ్బా! ఆకలిబాధ కడుపు తగులబెడుతూంది. మొగుణ్ణి వెళ్ళగొట్టి యే ముగంబెట్టుకొని పుట్టింటికి వెళ్ళేది—అబ్బా!

ఆకలి — మా పాౖరి నెవరైన పిలిచి నా యవస్థ చెప్పి నాదెగ్గరి కి పంపిస్తే — యింకెప్పుడూ అల్లరిచెయ్యకుండా దేముణ్ణి పూజించుకున్నట్టు పూజించుకుంద ను — అబ్బా ! నా కంతటి పాపిష్ఠమా — నే నీయాకలితో యివ్వాళే చచ్చిపోతానేమో! నే నెంత పాపాత్మురాలి నయిపోయినాను — ఆయన ప్రాణాల నెంత క్షోభ పెట్టాను. ఆ ప్రసురంతా యిప్పుడు తగులుతూంది— అయ్యయ్యో ! ఆకలి.....(పండుకొనుచున్నది).

చాక — (చాకలిది ప్రవేశించి) కరకాశెమ్మా — కరకాశెమ్మా— యేమున్నావమ్మా — ఏం ! నోరడిపోయిందేంటే ! మాట్టా డదేం ఇదుగో — ముసుగెట్టుకొనితొంగుంది — ఏటమ్మా— డబ్బియ్యాబడుతుందనేటి పరాంగెసాలు.

కర్క — (హీనస్వరముతో) ఏమిటే! చాకలిద్దానా ? మూడురోజుల్నిం చీ నాకు తిండిలేక పడుకున్నాను నన్నెందు కేడిపిస్తావే— వెళ్ళు.

చాక — మొగుణ్ణొళ్ళగొడితే కూడెందుకుంటదీ — యీ యేడుపుల కేంగాని నాజీత మక్కడెట్టు — ఎట్టాదే కదల్నియ్యను.

కర్క — నా దగ్గర డబ్బులేదే ! ఉంటే ఉపాస్య మెందుకుంటానూ ?

చాక — నువ్వుపోసముందు — చాప్రు — ఆదంతా నా కెందుకూ ? నా కారునెల్లజీత మియ్యాలక్కడెట్టుము౦దు — ఇయ్యకపోతి వా కాళ్ళెరగ మొదుస్తాను.

కర్క — ఏమిటే పెద్ద చిన్నా మెరక్కుండా —

చాక — పెద్ద సిన్న ను వ్వెరుగుండావా ? పెద్ద సిన్నా మెరుగుంటే మొగు ణ్ణొళ్ళగొడతావా ? చాకలిముండలుగూడా అలా సెయ్యరుగదా ! బాపనిదానవంట మల్లీసీ — నిన్ను పెత్తనం సెయ్యాలా ! పదిమాట్లు నాతో పనికిరావు. తెలిసిందా !

తలకాయ తాకట్టుపెట్టయినా సరే—రేపు వెల్లారేటప్పటికి నాజీత మియ్యకపోతివా కాళ్లురెండూ దుడ్డుకర్రి తీసుకొ విర గ్గొడతాను. నా పేరే గయ్యాళిగింగి—నువ్వేమనుకుంటుం డావో— మణుసులో.

(నిష్క్రమించును.)

కర్క——అయ్యయ్యో! ఈ గ్రిహచారమేమిరా దైవమా! ఈగ య్యాళిముండ అన్నంతపని చేస్తుంది. దీని జీతం నే నెక్కడి నుంచి తెచ్చిచ్చేది? వారుంటే చాకలిజీత మిచ్చేతురుగదా! వారిని వెళ్ళగొడితే పాణ్ణానికి సుఖంగా వుంటుం దనుకున్నా నుగాని యీ పేచీ లన్నీ వస్తా యనుకో లేదు—చూస్తు లేకున్నా పాణాలు పోతున్నా యింటోనే చావొచ్చునుగాని చాకలి దానిగోల తప్పించుకోడ మెల్లాగ?— నాయనా! యిదేం వుప దరివం?

[వీరిశెట్టి ప్రివేశము.]

వీరి—అనుభవానందుడుగారూ! అనుభవానందుడుగారూ!

కర్క——మళ్ళా యెవరో వొచ్చారు—యింకేం పిడుగు నా నెత్తిన పడుతుందో—

వీరి—అనుభవానందుడుగారు లేరమ్మా!

కర్క—లేరు.

వీరి—సరే!—వారుంటేనేం—లేకుంటేనేం—నేను రెండుముక్కలు చెపుతున్నాను వారొచ్చాక చెప్పండి? మాకాతా తాలూకు బాకీయేమి పయిసలా చేసేరుగారు రేపు కుండామండా బయటేసి మాసొమ్ము మేము రాబట్టుకుంటామని చెప్పండి— నే నెల్తున్నా—

(నిష్క్రమించును.)

కర్క——(ఏడ్చుచు) నాయనో! అమ్మో! ఇం కేముంది బాబో! కొంపలోంచికూడా వెళ్ళగొడతారుట! వారుంటే అన్ని వ్యవహారాలూ చూసుకుందురు——నేనే వారిని వెళ్ళగొట్టి ప్రాణాల మీదికి దెచ్చుకున్నాను. తెల్లవారేటప్పటికీ నన్నింటోంచి వెళ్ళగొడతారు. చాకలి దొచ్చి నాకాళ్ళు విరగ్గొడుతుంది విరగ్గొడితే నేను చచ్చిపోతాను గాబోలు! ఓ భగవంతుడా మాయింటివారిని నాకు దెచ్చియ్యి నాయనా! యీసారి వారు నాకంటబడితే ఏమీ అనను! నెత్తి నెక్కించుకుంటాను. పూవులతో పూజిస్తాను! అయ్యో! నాయనా! అమ్మా! నా కెంత అవస్థొచ్చిందే తల్లీ!——

[శాంతమ్మ ప్రవేశము]

శాంత——ఏమిటే కర్కశా! ఏడుస్తున్నావు?

కర్క——(శాంతను కౌగలించుకొని) నా శాంతమ్మక్కయ్యో! నా శాంతమ్మక్కయ్యో! నాతల్లీ! వొచ్చావా! నాకు దారేమిటో చూపించు తల్లీ! నీకాళ్లు బట్టుకుంటానమ్మా! నేను చచ్చే యోగం వచ్చిందే తల్లీ! నా ప్రాణాలు నిలపవే తల్లీ!

శాంత——ఏమిటి? ఏమిటి? సంగతేమిటో చెప్పు యెందుకలా యేడుస్తావు?

కర్క——నా మొగుణ్ణే యింటోంచి వెళ్ళగొట్టేనే అమ్మా! అనరానిమాట లన్నేనేతల్లీ! దణ్ణాలు పెట్టించుకున్నానేతల్లీ! అడ్డమైనచాకిరీ చేయించుకున్నానే శాంతమ్మక్కయ్యా! చలిలో తలుపు తియ్యక యేడిపించానే శాంతమ్మక్కయ్యా! చన్నీళ్ళు నెత్తిని గుమ్మరించానే శాంతమ్మక్కయ్యా! నీమొగుణ్ణి సోమదత్తుడు గార్నిగూడా దూషించానే శాంతమ్మక్కయ్యా! పాపిష్టిముండనయినానే శాంతమ్మక్కయ్యా! కూటికి మొగమువాచేనే

శాంతమ్మక్కయ్యా! రేపు చాకలిది జీతమియ్యకపోతే కాళ్లు విరగ్గొడతానన్నదే శాంతమ్మక్కయ్యా! బాకీ యివ్వకుంటే వీరిశెట్టి కుండామండా బయటేస్తానన్నాడే శాంతమ్మక్కయ్యా! నాగతిలా అయిందే శాంతమ్మక్కయ్యా! నామొగుణ్ణి మళ్ళీ నాకు తెచ్చిపెట్టండే శాంతమ్మక్కయ్యా! యీసారాయన కాళ్లునెత్తిన బెట్టుకుంటానే శాంతమ్మక్కయ్యా! ఏమన్నా నోరు విప్పితే గడ్డిపెట్టండే శాంతమ్మక్కయ్యా! వో శాంతమ్మక్కయ్యా! (ఏడ్చును.)

శాంత—ఎందుకలా అల్లరిచేసుకుంటావు. నవ్వుతూ చేశావు—ఏడుస్తూ అనుభవిస్తున్నావు. తిండితిన్నావా!

కర్క—మూడురోజులయిందే శాంతమ్మక్కయ్యా!

శాంత—అయ్యో! వెర్రిబాగులదానా! అంతతిండికి లేకుంటె నాతోనైనా చెప్పావుగావే!

కర్క—నాగతంతా యీలా అయిందే శాంతమ్మక్కయ్యా—

శాంత—ఎవరినంటావు. నువ్వేచేసుకున్నావు. ఎలాంటి నోరులేని మహారాజును ఎంతల్లరిపెట్టి వెళ్లగొట్టావు? అందరితో విరోధమే కదా!

కర్క—తెల్లవారితే చాకలిదానిమాటా—వీరిశెట్టిమాటా యేమిటే శాంతమ్మక్కయ్యా!

శాంత—ఉండు—ఏడిస్తే అవుతుందా? మీబావగారొచ్చాక చెప్పి ఏదోవిధంగా చేయిస్తానులే!—

కర్క—సోమదత్తుడుబావగారిని తిట్టేను. వారిమొగమేలాచూసేదే శాంతమ్మక్కయ్యా!

శాంత—భయంలేదులే వారేమీ అనరు. ముందు తిండిలేకుండావున్నావు. అన్నంవండి నిన్ను కేకవేస్తానుండు.

(నిష్క్రమించును.)

[తార్పుగత్తె యగు నొకవృద్ధురాలు ప్రవేశము.]

తార్పు—కర్కాశమ్మా!

కర్క—(లేచి) ఆ!—ఎవరమ్మా అది?

తార్పు—నేను మామ్మనిగానటే కర్కాశా!

కర్క—(లేని తెలివి తెచ్చుకొని) మామ్మా! ఏంపనిమీదొచ్చావు? దారితప్పొచ్చినట్లున్నావే!—

తార్పు—దారిదప్పడమేమే! నీకోస మొచ్చాను. (స్వగ) కొత్వాలు కొడుకు కర్కాశని తనకు తారుస్తే పదిరూపాయి లిస్తానన్నాడు. ఇది వెర్రిబాగులముండ డబ్బులేకుండా తంటాలు పడుతూంది. దీన్ని గోతిలోకి లాగడానికిదే మంచిసమయం (ప్రకాశముగ) అయితే కర్కాశా! మీఆయన నిన్నొంటరిగా వదలిపెట్టి వెళ్ళిపోయినాడటగా—

కర్క—కాదు—కాదు వారు—

తార్పు—వారు లేదు—గీరూ లేదు— అసలు యింట్లోంచి వెళ్ళిపోయినట్టేనా?

కర్క—ఆ! వెళ్ళారు.

తార్పు—ఎంతదుర్మార్గుడు. ఆడదాన్నింటో పారేసి వెళ్ళాడా!—పోనీలే—నీవు దిక్కుమాలినదానవు కావద్దులే—అనేకమంది నువ్వంటే రూపాయిలవర్షం కురిపించేవా రున్నారు.

కర్క—(ముఖవికాసముతో) ఎవరుమామ్మా ఎవరు? ఎవరు నేనంటేరూపాయిలవర్షం కురిపిస్తామన్నారు—

తార్పు—ఒక్కరన్నమాటేమిటి అనేకమంది. మాటవరుసకి మన కొత్వాలు కొడుక్కి నువ్వంటే యెంతో దయ.

కర్క—మామ్మా! కొత్వాలుకొడుక్కి నేనంటే ఎందుకే దయ?

తార్పు—ఎందుకేమిటి? పూరికేనే- అతడు సహజంగానే దయగల

వాడు. ఇప్పుడు నీ యిబ్బందులన్నీ విన్నాడు. రూపాయిలు తీసుకొస్తాడు.

కర్క—ఆ! ఆ! ఇప్పుడేనా! నిజమేనా?—

తార్ప—ఆ! సందేహమేమిటి; నేను తీసుకొస్తానుండు.

(నిష్క్రమించును.)

కర్క—(స్వగతం) కొత్వాలుకొడుకు చాలామంచివాడయివుంటాడు. నామీదెంతో దయట! యీసంగతి నాకిదివరకే తెలిసుంటే పెంకిచాకలిముండ పెంకితనం వొదిలించుందును. ఆయన వచ్చేసరికి కుర్చీ వేస్తాను.

(మేజాబల్ల కుర్చీ వేయును.)

[తార్పగత్తె- కొత్వాలుకొడుకు ప్రవేశము.]

తార్ప—నాయనా! పాప మీ కర్కశ మొగుడు వొదిలిపెడితే దిక్కులేకుండావుంది. చాకలిదాని అల్లరి పీరిశెట్టిగోలా లేకుండాజేసి రక్షించు. దానిదగ్గర డబ్బుగూడా యేమీ లేదు. ఏమిస్తావో నేను చెప్పనక్కరలేదుగదా! కర్కశా! ఆయన చాలా మంచివాడు. మర్యాదజేసి పంపించు; తెలిసినదా నేనిక వెళుతున్నాను. (నిష్క్రమించును.)

కొత్వా—(కుర్చీపై గూర్చుండి తనలో) దీని అందం చూచినప్పుడే నామీద మన్మథుడు పూలబాణాలు విడిచి బాధించాడు. ఎన్నాళ్ళనుంచో దీనితో సంబంధం యేలాకలుస్తుందని చాలా విచారించాను. ఇప్పటికి కోటరీగా దొరికింది. ఈసమయం పాడుజేసుకోగూడదు. (రూపాయిలు బల్లపై గుమ్మరించి) కర్కశా! నీమొగుడు చాలాదుర్మార్గుడు. దమ్మిడీయైన యింట్లో యివ్వకుండా వెళ్ళి నిన్ను చాలా అన్యాయం చేశాడు.

అందువల్ల నువ్వేమీ యిబ్బందిపడవద్దు. చాకలివానికీ వీరి శెట్టికీ యీరూపాయిలు మొహాన్ని పారవేసి- నువ్వీరూపాయిలు తీసుకో- తెలిసిందా ?

కర్క — మీరు చాలాదయగలవారు. మీరుణం యేలాతీర్చుకోగలనో తెలియడం లేదు.

కొత్వా — పరవాలేదు. నీ కాభయమేమీ అక్కరలేదు. నాఋణం తీర్చుకోవడానికి మార్గం లేకపోలేదు. నీవు నిలుచోనేవున్నావే- కూర్చో.

కర్క — అక్కరలేదు లెండి నిలుచుంటాను.

కొత్వా — తలుపు వేసుందా- తీసుందా ?

కర్క — వేసిలేకున్నా యెవరు రారు లెండి.

కొత్వా — (తనలో) ఓహో ! దీనికున్నూడా వుద్దేశ మున్నట్టేవుంది. కాని యేవిధంగా పలుకరించవలెనో తోచడంలేదు- కానీ- యీదారి తొక్కుదాము. (సారాబుడ్డితీసి) యిదిగో- యిదేమిటో చూశావా ?

కర్క — ఏమిటో నాకేమి తెలుస్తుంది.

కొత్వా — ఇది తాగితే చాలా ఆనందంగా వుంటుంది. కొంచెం తాగుతావా ? (నోటివద్దనుంచును.)

కర్క — (అసహ్యపడి) ఛీ. ఛీ. ఇదేమిటి సారాయికాబోలును. మేమిటువంటి వస్తువులు తాగగూడదు. మీరు తాగుతారా యేమిటి ?

కొత్వా — పోనీ ! నీకిది యిష్టం లేదుగనుక యీవస్తువులు చూడు. (కొన్నివస్తువులు అంగినుంచి తీసి) ఇవి అత్తరులు- ఇవిద్రాక్షరసాలు- ఇవి గులాబిపువ్వులు- ఇవి మిఠాయిలు- నీకోసం తెచ్చాను.

కర్క—ఇవన్నీ నాకెందుకులెండి. చాలాశ్రమపడ్డారు.

కాత్యా—(తనలో) ఇది డొంకతిరుగుడుమార్గాలు గ్రహించడము లేదు. బలాత్కారముచేయడమే మంచిది. (సగముమిఠాయి తాను తిని ప్రకాశముగా) ఇదిగో నీకు నామీద ప్రేముందా?

కర్క—(తనలో) ఇతని వుద్దేశము సరిగా వున్నట్టులేదు. (ప్రకాశముగా) ప్రేమంటే?

కాత్యా—అభిమానముందా?

కర్క—కావలసినంత వుంది?

కాత్యా—దానికి దాఖలాయేమిటి?

కర్క—నే నేమి చూపగలను?

కాత్యా—నువ్వీ మిఠాయితింటే నీకు నామీద ప్రేమవుందంటే నమ్ముతాను.

కర్క—మీరు సఖము తిన్నది నే నేలాతింటాను.

కాత్యా—మరి యిదేనా అభిమానం ?—

కర్క—(అసంతృప్తిగా తనలో) వీడు నన్ను కులంచెరపటానికి వచ్చినట్టు తోస్తుంది. (ప్రకాశముగా) నే నెంగిలి తినేదాన్నిగాను.

కాత్యా—మరి నీకు డబ్బిచ్చి నిన్నాదరించినవాణ్ణిలా చేయడం నీకు మంచిదేనా ?

కర్క—డబ్బులేకున్న మానె- నే నెంగిలి తినను.

కాత్యా—(తనలో) దీని నిక బలవంతపెట్టడమే మంచిది. (ప్రకాశము) తినకుంటే తినిపించగలను.

కర్క—ఏమిటి నీవుద్దేశం? నేను పడుపుకత్తె ననుకొన్నావా? భోగముదాన్ననుకొన్నావా? ఎలాతినిపిస్తావో తినిపించు?

కాత్యా యిలా తినిపిస్తాను. (నోటిలో మిఠాయివుండ బెట్టబోవును.)

కర్క—(చెంపమీదగొట్టి) నాచేత నీవెంగిలిమితాయి తినిపిస్తావుగా! జాగ్రత్త- బ్రదకదలిస్తే తక్షణం నాయిట్లోం చవతలికి నమ్ము- లేకుంటే చస్తావ్రా—నీఅబ్బా—నీయత్తరుబుడ్లూ — నాకక్కర లేదు - నీమూపాయిలు నీనెత్తిన గొట్టుకో. (అన్నిటి నావల విసరివేయుచున్నది.)

కొత్వా—నిన్ను బలవంతంగానైన కౌగలించుకుంటాను. నే నెవ ణ్ణనుకున్నావో- కొత్వాలు కొడుకుని.

(బలవంతముగా కౌగలించుకొనబోవును.)

కర్క—(పెద్దగా కేకలువేయుచు, కొత్వాలును రక్కుచు చేయి కరచుచు) ఓ సోమదత్తుడుబావోయి - ఓ శాంతమ్మక్కయ్యో యి—రండిరో— రండిరో! నన్నీ దుర్మార్గుడు కౌగిలించుకుంటు న్నాడు. చాప్రు దొంగముండకొడక- (గట్టిగ కరచును.)

సోమ—(ప్రవేశించి కర్కశతో గొట్టుచు) ఎవడురా దుర్మార్గుడు! బుర్ర పగలగొడతా—

(దెబ్బలు తిని కొత్వాలుకొడుకు పారిపోవుచున్నాడు. ఒకప్రక్క నుండి తార్పుగత్తె త్తరముతో పరుగెత్తుచున్నది.)

[శాంతమ్మ ప్రవేశము.]

శాంత—ఏమిటే! కర్కశా! ఏమయిందే?

కర్క—నా శాంతమ్మక్కయ్యా! నేటితో నామానప్రాణాలు పొయ్యే యోగంగూడా దాపరించిందే.

శాంత—ఏమిజరిగింది! ఆవెధ వెవడు? ఆముసలిముండ యెవ్వతె?

సోమ— ఎవరున్నారింకా! ఆముసలిముండ తార్పుడుగత్తె ఆవెధవ ముండలముఠాకోరూంనూ! ఆమహానుభావుడు కాస్త కొంపలో లేకపోవడంతోటే ఎన్నిఅవస్తలు పట్టాలో అన్నీపట్టినవి.

కర్క—నాదేవుణ్ణి మళ్ళీ నాకు తెచ్చిపెట్టండి సోమదత్తుడు బావయ్యా!

సోమ—ఎందుకమ్మా మాకీఅల్లరంతానూ! రేపటినుంచీ మళ్ళీ మీ కథలన్నీ రామాయణ భారతగాధలు.

కర్క—శాంతమ్మక్కయ్యా! నువ్వయినా చెప్పవమ్మా.

శాంత—(మగనితో) ఇంక నెందుకు దాన్నేడిపిస్తారు? మంచో-చెడ్డో- బుద్ధితక్కువో- యెక్కువో చేసింది, అనుభవించింది, యికమళ్ళీ యెప్పుడూ యిదివరకులాగ ప్రవర్తించదు లెండి.

సోమ—ఎక్కడున్నాడో యేమిటో! నేనేలాతీసుకొచ్చేది?

శాంత—మీరుతలుచుకుంటే తీసుకరాలేకపోతారా?

సోమ—తీరా తీసుకొచ్చాక వెనుకటిపాటే పాడిందంటే చాకలిదాన్ని శెట్టినీ వదలుతాను.

కర్క—నాయినోయి చాకలిదాన్ని వదిలేటట్టయితే అది నాకాళ్లు విరగ్గొడుతుంది. శెట్టిని వదలేటట్టయితే కుండా మాడా బయటవేస్తాడు.

సోమ—ఆ! అయితే ఆభయంమీద వుండు. ఏలాగో శ్రమపడి మీ యాయన్ను తీసుకొస్తాను. (నిష్క్రమించును.)

కర్క—శాంతమ్మక్కయ్యా! ఆయనవస్తే యేంచెయ్యాలో యేమనాలో నాకేమీ తెలియదే?

శాంత— ఏమంటావు? అమాంతంగావెళ్ళి కాళ్లమీద పడు- అంతకంటే యేముంది?

కర్క—అంతేగాదు గొల్లున గోలబెట్టి యేడుస్తానుగూడాను.

[సోమదత్తుడు, అనుభవానందుడు, ప్రవేశింతురు.]

అను—సోమదత్తుడన్నా! నా కాగయ్యాళితో పోరుసరిపడదయ్యా అంటూవుంటే వినకుండా ఎక్కడో జపంచేసుకుంటూ రోజు

లు వెళ్ళబుచ్చుకుంటున్న నన్నీ సంసారంలోకి దింపావుగదా!

సోమ—అన్నా! మనకర్కశ నిన్నిక నేమీ బాధపెట్టదు.

అను—అయితే మరినడువు. అన్నిబాధలు నీవే.

శాంత—అదిగో! మీబావగారు మీవారిని వెంటబెట్టుకొస్తున్నారే!

కర్క—(తటాలున కాళ్ళపైబడి) నా భగవంతుడా! నా నారాయణ మూర్తీ! నాశేవుడా! నా కళ్ళకు మళ్ళీ కనపడ్డావా! నా ప్రాణాలు నిలువబెట్టావా? నిన్నిక నెప్పుడూ బాధించను నన్నువదలి వెళ్ళకు.

అను—నా రెండు కీయల్లరి సోమదత్తుడన్నా! నాదారిని నేను వెళతాను.

కర్క—నా భగవంతుడా! నీవు వెళ్ళిపోతే నాప్రాణాలు వదులుతాను.

సోమ—వెళ్ళడుగాని ప్రొద్దెక్క నిద్రలేచి పలుదోంపుల్ల తెచ్చిమ్మని అడగవుగదా?

కర్క—అడగను.

సోమ—ఇంటికి యాయవారాని కెవరయినా వస్తే యెంగిలిపుల్లనోట్లో పెట్టవుగదా?

కర్క—పెట్టను.

సోమ—చద్దెన్నంతింటూ పూజలోవున్న మగడికి పనులు చెప్పవుగదా?

కర్క—చెప్పను.

సోమ—దేవతార్చనమీదికి ధూళి చిమ్మవుగదా?

కర్క—చిమ్మను.

సోమ—శిశువుడికి మాసపించి నీవు మంగళహారతి పట్టించుకోవుగదా?

కర్క—పట్టించుకోను.

సోమ — అర్ధరాత్రి యింటికివస్తే తలుపుతీయనని తిట్టవుగదా ?

కర్క — తిట్టను.

సోమ—సత్యనారాయణప్రసాదము నిరాకరించవుగదా ?

కర్క — నిరాకరించను.

సోమ - చలిలో మీాద నీళ్ళు పోయవుగదా ?

కర్క — పోయను.

సోమ—అయితే పతివ్రతాధర్మా లేమిటో తెలుసునా ?

కర్క — తెలుసును. (అనుబంధము.)

సోమ — అయితే లెంపలువేసుకో.

కర్క—(అట్లు చేయును.)

సోమ—అనుభవానందుడన్నా ! యిప్పుడు బాగా బుద్ధొచ్చింది. ఇక నీభార్య నేలుకో.

అను—నువ్వు చెప్పావుగనుక మళ్ళీ యీకొంపలో వుంటున్నాను.

సోమ — అదే ! నాకు కావలసినది. మనమంతా ఆనందంగా దేవభజన చేతాము.

అను — ఆలాగే చేతాము.

[అందరు పాడుదురు.]

(అనుబంధము.)

తెర వ్రాలును.

ఇది షష్ఠాంకము.





శ్రీ

# పత్నీప్రతాపము

అను

# అనసూయానాటకము.



## సప్తమాంకము.



### వైకుంఠము.

[ద్వారమున నారదుఁడు ప్రవేశించును.]

నార—(స్వగతం) ఆహాహా! నే నెంతచమత్కారమగు కలహనాటకము నాడించితిని.

సీ. తొలుదొల్త జాహ్నవీదురితమూలమున, దే
    వీత్రయమున కీర్ష్య వెచ్చినాఁడ
పార్వతీదేవిగర్వము సర్వమును భృంగి
    కతమున నణఁగుటఁ గాంచినాఁడ
మదనుని దర్పంబు మాయుట ఖిన్నయా
    శ్రీదేవిఁ గనుల వీక్షించినాఁడ
సతినిఁ బరీక్షింపఁ జని, మాధవాదు లా
    యతివకుఁ దనయులౌ టరసినాఁడ—
సతిపదంబుల నీత్రిదేవతలఁ గాంచి
గులకరాళ్ళను పరిపక్వములుగఁ జేసి

హాయిగ భుజించు టవశిష్ట మయ్యెనింక-
తత్కథానకమున కయి తరలువాడ !

(నిష్క్రమించును.)

రెండవ రంగము.

వైకుంఠమందిరము.

[త్రిదేవులు ప్రవేశింతురు.]

లక్ష్మి—చెలులారా ! మనపతు లీపాటికి మరలివచ్చుచుందురనియే నా మీయభిప్రాయము ?

పార్వ—అనసూయాగర్వభంగ మైన చిహ్నము లేమియు దోచుట లేదే ?

సర—చిహ్నములనగా నీకేమి కనబడును ? ఆకాశమున సూర్యచంద్రుల కేమైన గ్రహణములు గలుగవలెనా ?

పార్వ—అవశ్యముగ గలుగవలసినదే!- ఒకమహాసాధ్వికి మానభంగము కలుగగా ప్రకృతి యడలి కంపింపకుండునా?

గీ. తారకలు నేలరాలు; భూధరము లేపు
తలలు క్రిందికివంచు; నీధరణి దిరుగు-
మింట రవిచంద్రులు పరిభ్రమింతురు గాదె !-
సాధ్వులకు మానభంగమా సమయమందు.

లక్ష్మి—నీవు సాధ్వులమాటగదా చెప్పుచుంటివి.

పార్వ—ఔను.

లక్ష్మి—అట్లయిన ననసూయను సాధ్వులలోనే చేర్చితివా ?

పార్వ—ఆహా- కాకేమి ?- మనము చూడలేదా ?

సర—ఉండుఁడు— నారదుఁడు వచ్చుచున్నాఁడు; మన కేదో వార్త తెలియగలదు.

[నారదుఁడు ప్రవేశించును.]

లక్ష్మి — నారదా! ఇప్పుడు చూచితివా మాపరితాపము!- అనసూయ దుర్గతిని నీ వెఱింగియుందువు. ఏదీ చెప్పుము?

నార — అమ్మా! తప్పు తప్పు- ఇప్పు డట్లనగూడదు. అనసూయ సద్గతి! మీపతుల దుర్గతి! అనవలెను.

లక్ష్మి — నారదా! మాపతుల దుర్గతి యనుచున్నావేమిఁ? ఏమి జరిగినది?

నార — సావధానులరై యాలకింపుఁడు-

ఆ. తాపసాకృతులను దాలిచి యాసాధ్వి
గాంచి, మొదలికంచుకములు విడచి-
యెలమిమీర భిక్ష మిమ్మన్న మూర్తుల
శిశువులఁగాల మార్చి క్షీర మిచ్చె.

లక్ష్మి — ఆ ఆ- నారదా!- ఇది పరిహాసమా నిజమా!

నార — సాధ్వితో పరిహాసమాడబోయి సర్వనాశమునకు మీరు తలయొగ్గితిరిగాని నేను మీతో పరిహాస మాడుదునటమ్మా!

లక్ష్మి — అట్లయిన మాపతు లనసూయకడ, శిశువులై పాలుద్రాగుచుండిరా?

పార్వ — నారదా!- ఇంక మాకు దిక్కెవ్వరు?

సర — అయ్యయ్యో! తలవనితలంపుగా నెంతపని జరిగెను!

నార — అమ్మా!- పతులు పసిబాలురైనను విచారమేల? నాల్గు దినము లోపికపట్టితిరా నవయౌవనులగు భర్తలు లభింపఁగలరు.

లక్ష్మి — సరిపోయినది!- పిల్లి చెరలాట మెలుకకు ప్రాణసంకట మనునట్లు నీకిది యొక పరిహాసమయము!

(37 అనుబంధము.)

నార—తల్లులారా !- ఇప్పు డీనారదుఁడు మీ కవసరమాయెనా ?- ఇదివఱకెల్ల నే నాడిన ప్రతిమాటయు మీకు శ్రుతికఠినం బులే యయ్యెఁగదా ! చేయి కాలినపిదప నాకులకొఱకు ప్రయత్నించిన ఫలమేమి ?—ఐనను నేనుచెప్పిన నామాట పాటించి వినువారెవ్వరు ? సతులు మీరు- పతులు వారు- అనసూయను మీరు స్వయముగా ప్రార్థించినమాత్రము వచ్చు దోషమేమి ?—మీ కామె క్రొత్తగా సత్తగారైనది గదా !

లక్ష్మి—నారదా ! ఇంతకాలమునుండియు నెంతపట్టుదలతో నెంతప్రతాపముతో ననసూయను శోధించితిమి. ఇప్పుడు మేము స్వయముగా- నామెపాదములఁ బడిన లోకులునవ్వరా ? లోకులవఱ కెందుకు ? నీవు నవ్వవా ?

పార్వ—ఒకరిని పరిహసించి యెఱుఁగుదువుగాని యితవఱ కొకరి పరిహాసమునకు పాలైయెఱుఁగవుగదా ! నారదా !—అట్టి మాకిప్పు డవమానమగుట నీ కానందమేనా ?

సర—ఇన్నిమాట లెందుకు ? ఆనందమేకాదు. అస లీకలహనాటకమునకు సూత్రధారియే యీనారదుఁడు.

నార—సరిసరి ! —తల్లీ !—తుదకు నాపై సొగసైన నిష్ఠురము వేసితిరి !—వా కెందులకమ్మా !—నే నెఱుఁగుదును మీరడిగితిరి గనుక చెప్పవలసివచ్చెను- వచ్చినవాదు రానేవచ్చినది. వచ్చినట్లు నాదారిని నేను బోవుదును. (పోబోవును.)

లక్ష్మి—నారదా !—నారదా !—

నార—ఏమిసెలవు ? తిరిగి యేమైన బిరుదు కటాక్షింతురా ?

లక్ష్మి—అయిన మాకు కర్తవ్య మేమి ?

నార—కర్తవ్యము నేనా మీ కుపదేశింపఁగలవాఁడను. నాహితోపదేశములను వేనిని పాటించిరని మీకిప్పుడు వెండియు సిగ్గుమాలి హితోపదేశముచేయుదును.

లక్ష్మి—నారదా ! అజ్ఞానమున గావించిన మాయపరాధములను క్షమింపుము.

నార—నాకంత యపచారము తలగట్టు టేమిన్యాయము తల్లీ ! మీరు సామాన్యులా !—జగన్మాన్యమాతృదేవతలు. అనసూయ మీ కాలిగోటికైన సాటిగాదు.

లక్ష్మి - నారదా !— వెనుకటి మాచర్య లెట్లో- మాటలు నట్లే యజ్ఞానఫలితములని చెప్పితినిగాదా ! తిరిగి చెప్పనేల ?—అనసూయయే మమ్ము గెలిచినది. మేమే యోడితిమి.

నార—(తనలో) భళి ! ఎన్నినాళ్ళకు వినదలచినమాట విని సిద్ధసంకల్పుండ నైతిని. (ప్రకా॥) అమ్మా ! మీరేకాని యీ భారతీపార్వతు లాయనసూయ కోడినవారు గారా ? మిన్నకున్నారు.

లక్ష్మి -వారును నాతోపాటువారే కదా !

నార—అట్లు వారినోట విన నభిలషించుచుంటిని.

పార్వ - నారదా ! అనసూయయే గెలిచినది; మే మోడితిమి.

సర—నారదా ! అనసూయయే గెలిచినది; మే మోడితిమి.

నార.—ఇదిగో ! కర్తవ్యము వినుండు.

గీ. కలుషశతమును క్షమియించి కావుమనుచు
మీర లనసూయపాదసమీపమందు
శిరము లిడి నాథులను దయ చేయుమంచు
ప్రార్థనము చేయు టొకటె కర్తవ్య మిపుడు.

(38 అనుబంధము.)

త్రిదే—నీవు చెప్పినట్లే చేయుదుము.

(అందఱు నిష్క్రమింతురు.)



దృశ్యము—అత్రియాశ్రమము.

[అనసూయ బియ్యము దంపుచుండును. త్రిదేవులు నారదుండు చాటున ప్రి॥]

**నార**—అమ్మా!—ఇల్లదే మీభర్తలు శిశురూపముల దాల్చి డోలి కాంతర్గతులయి సుఖనిద్ర నందియున్నారు- చూడుండు.

సీ. నిర్నిద్రమహిమాపునీతులౌ మూర్తులు
  నిదురించుచుండి రేకొదలులేక
గర్భాంతరముల జగంబులుగల్గువా
  రొకసాధ్వియొడిలోన నున్నవారు
యోనిసంభవము లేకున్నవారలు నేడు
  మగువకొక్క తెకుఁ గుమారులైరి
భువనంబులకు నాదిపూరుషు లగువారు
  ప్రకృతికంతకు చిన్నవారలైరి
అహహా! నేడు త్రిమూర్తుల యంతవార
లీసతీబలమున బలహీనులైరి
వసుధ బతిపూజనముకన్న వ్రతముగలదె,
సాధ్వులను మీరుఘనులు విశ్వమున గలరె?

**లక్ష్మి**—నారదా!—మే మరిగి యామెను బ్రార్థింపమా?

**నార**—వలదు. ఇప్పు డామె కార్యాంతరప్రవృత్తయైయున్నది. సావ కాశముచు చూచి సమయము నెఱిఁగించెదము. ఇందుండుఁడు.

(చాటున నుందురు.)

[అత్రి ప్రవేశము.]

**అత్రి**—ప్రాణేశ్వరీ! కవాటము—కవాటము.

**అన**—ఆహా! నా భాగ్యమేమి?—ప్రాణేశ్వరుఁడే వచ్చెను. కవా

టము బంధింపఁబడి యున్నది కాఁబోలును; తెలిసి వచ్చె
దను.

(ఎత్తినరోకలి నట్టే వదలి నిష్క్రమించును. రోకలి క్రిందపడక
నడుమనే నిలచి యుండును.)

లక్ష్మి—నారదా ! ఏమియద్భుత మిది !—ముసలము నేలబడదే !

పార్వ—నారదా ! అనసూయ మంత్రగత్తెయా యేమి ?

సర—నారదా !—మాకిది కలయా నిజమా !

నార—అమ్మా ! —అనసూయామహాత్మ్యమును నే వచింప నవ్వి
హేళనము చేసితిరే !

గీ. నిరతపతినామమంత్రంబు నేర్చినట్టి
మంత్రగత్తియె యీమె—తన్మంత్రమున, మ
హాద్భుతంబులు సల్పి సత్యంబు కలయు
దోపనీయని సాధ్వి యీ దోషరహిత.

[అత్రి, అనసూయ ప్రవేశము.]

అత్రి—సతిమణీ ! నీ విప్పుడు చెప్పిన విషయములు సత్యములగునే?

ఆ. వనమునందు నాకు వరము లొసంగి, యి
క్కరణి పుత్రికులను గల్గఁజేసి—
సదయు డగుచు మనకు సద్యోఫలంబు గ
ల్గించె నీశ్వరుండు ప్రాంచితముగ.

పుత్రులను చూతము లోనికి రమ్ము.

(నడతురు.)

అత్రి—(రోఁకలిం జూచి) అనసూయా ! ఇదేమి యీ ముసలము భూ
మ్యాకాశమధ్యముల వ్రేలాడుచున్నది.

అన—(రోఁకలి నందుకొని యథాస్థలమున నుంచి) మరచితి—నిదిం
పుఁడు—ఇంతదనుక శాలిదంశనము చేయుచుంటిని. తన

రరుచెంచిరను నానందమున దాని నల్లే విడచి కవాటవిపా టనమునకు వచ్చితిని. తమ మహిమచే నది యట్లే యుండె గాబోలు.

అత్రి—ఏమి !—ఇది నా మహిమయా! ఎంత నిగర్వి—ఎంత మహిమాన్విత—ఇట్టి సాధ్వీమణి నా సతియగుటచే నే మిగుల ధన్యుడగదా!

అన—నాధా! వీరేపుత్రులు; నిద్రించుచున్నారు.

అత్రి—వీరు సామాన్యులు గారు!—మనల ననుగ్రహింప త్రిమూర్తులే వచ్చిరని తోచెడును.

నార—అమ్మా—మీ కిదే తరుణము; పోయి ప్రార్థింపుడు.

త్రిదే—(అనసూయ పాదముల బడి) సాధ్వీ! పతిభిక్ష! పతిభిక్ష!! పతిభిక్ష!!

(అనుబంధము 39)

అన—అమ్మా! మీ రెవ్వరు?

లక్ష్మి—సాధ్వీమతల్లీ! మేము త్రిమూర్తుల సతులము. మాసహసాదోషములను క్షమింపుము. నిన్ను పరీక్షింప దలచి మేమే నీ కిన్నియిడుమలు సమకూర్చితిమి. నీవే గెల్చితివి!—మే మోడితిమి!

నార—(ప్రవేశించి) బ్రహ్మానందము—బ్రహ్మానందము.

అన—త్రిదేవులారా! లోకమాతలారా!—నమస్కారములు—దేవమునీంద్రా! నీకు వందనము. అమ్మా! ఏమి యీ యద్భుతము—మీ రోడుటేమి! నేను గెలుచుటేమి?—నన్ను మీరు చేసిన పరీక్షయెట్టిది? నా కొకటియుం దెలియదు!—చిత్రముగా నున్నది.

అత్రి—నారదా!—ఏమి యీయద్భుతనాటకము?

నార—అత్రిమునీంద్రా! ఈ దేవి సాధ్వీతచరిత్రము ముల్లోకము లాద్భుతము.

(అనుబంధము 40)

తల్లీ! త్రిదేవులారా!—నాడు నే నుగ్గడించిన యనసూయా ప్రభావము స్మృతికి వచ్చినదా!—కాదు—నేను స్మృతి గల్గింతును. వినుడు.

(ప్రథమాంకమునందలి, "బహుపాపతతులచే" అనుపద్యము తిరిగి చదువును.)

నేనుగ్గడించినంతకన్న నధికమే జరిగినది గదా!

లక్ష్మి—త్రికాలవేదివగు నీ పల్కుల కన్యధాత్వము గలదా.

అన—అమ్మా!— మీకేమి గావలయు—

లక్ష్మి—సాధ్వీరత్నమా!

గీ. మాపతులు భవత్కుమారు లయిరి, మా
కనయ మీవు పూజ్య వైతివమ్మ!
పరమకృపను మాకు పతిభిక్ష నొసగ మాం
గల్యరక్షణం బొనర్పు మమ్మ!!

అన—తల్లీ! ఇది యుక్తమగు నీప్సితమా!—లోకమున తమ కుమారుల నెవరైన భిక్షమిత్తురా—అలౌకికాభిలాష మీకు తగునా?

లక్ష్మి—నారదా!—నీవైన ననసూయకు చెప్పుము—ఆమెయే గాలిచెను.

నార—నే నేమి చెప్పవలెను?—ఎంతో చనువున, మీకడ పుత్రిని వలె చరించు నా మాటలు మీరే వినకుంటిరి—అపరిచిత యగు నామె వినునా?

అత్రి—ఓహో!—గొప్పతగవు వచ్చినది. ఇది యశరీరవాణి దక్క నన్యులు తీర్పలేరు.

[తెరలో]

సాధ్వీ! అనసూయా! నే నాకాశవాణిని. త్రిమూర్తులు లేకున్న ప్రపంచము లుండవు. కావున వారికి నిజరూపముల నిమ్ము. నీకు తదంశములు గల పుత్రుడు జనింపఁగలఁడు.

నార—సతీతిలకమా!—అశరీరవాణి యానతి యైనది. కాన, నిక త్రిమూర్తులకు పునర్జన్మము నిమ్ము.

అన—దేవా! ధన్యనైతిని. (జలంబులు వార్చుచు) పరమేశ్వరా! నాపతి తపోమహిమంబున నీబాలురు యథాపూర్వముగ త్రిమూర్తు లగుదురు గాక!

(నీరు చల్లగా బాలురు త్రిమూర్తు లగుదురు.)

అత్రి—ఆహా!—నా జన్మము చరితార్థమయ్యె—నేడుగా సుదినము!

గీ. చిరపురాకృతకర్మ విశేషమున, త్రి
మూర్తులను గంటి నొక, సుముహూర్తమున నె
నారద త్రిదేవీదర్శనము లభించె
మోద మిక చాలు, నా జన్మమునకు భళిర!

విష్ణు—అత్రిమునీంద్రా!—మా దర్శనమునఁ గాదు—మహాసాధ్విని సతిగా, గాంచినందుననే నీవు ధన్యుఁడవైతివి. ఇప్పుడు పరాజితులైన యీ త్రిదేవుల పతులమగు మాకన్న, మహాసాధ్వి పతివగు నీవే ఘనుఁడవు—నీ జన్మాంతర పుణ్యకర్మ విశేషమున నీకు పుత్రులమైతిమి. దత్తాత్రేయరూపమున మేము మా మూఁడుభాగంశలతోడను, నీకు గుమారుల మౌదుము. ఓసతీమణీ!—అనసూయా!

గీ. నిన్నిటులఁ బరీక్షించుట నీ యశంబు
నధిక మొనరించుటకె, కాన, నమ్మరో! గ
తించినట్టి చరిత్రఁ దలంచఁబోక
సాధ్వులం దగ్రగణ్యవై చనఁగదమ్మ.

అన — దేవా! — చరితార్థురాలనైతిని.

విష్ణు — లక్ష్మి సరస్వతీ పార్వతులారా! — సతీసత్వపరీక్షాఫలితము గాంచితిరి గదా! — ఇకనైన నాత్మబోధితలై చనుఁడు — మేము పోవుచున్నాము. (త్రిమూర్తులు పోబోవుదురు.)

నార — అచ్యుతా! చిన్న మనవి యున్నది.

విష్ణు — ఓహో! — నీవిందే యుంటివా! — విశేష మేమి?

నార — ఎవరికోరికలు వారు తీర్చుకొని పోవుచున్నారు. నామాట యేమి చెప్పితిరి?

విష్ణు — ఈ కలహమహానాటకమునఁ గలహాశనుఁడవగు నీకోరికయే కదా నిండినది!

నార — నా కోరికయా తీరినది! సతీయనసూయ ధర్మమా యని నిజ రూపములు మీకు వచ్చుటచే నాకోర్కె తీరినదా! - మీరు మీ సతులకు తిరిగి దక్కుటచే నా కోర్కె తీరినదా!

విష్ణు — సరిసరి — చాలించు — విశేషముగ ముండ్లపొద కదలింపకు — నీతీరవలసిన కోరిక యేమో చెప్పుము.

నార — ఏమియును లేదు — కడుపున నాకలి యగుచున్నది.

లక్ష్మి — కలహములు కడుపునిండ నిప్పటివఱ కారగించుచునే యుంటివే! — ఇంక నేమి యాఁకలి?

నార — (శిరఃకంపముచేసి) అమ్మా! — ఒకపత్రిక నింకను నిండలే దు — కొంచెము వెలితియున్నది. ఈపరిశిష్టముతో నది పూర్ణ మగును.

విష్ణు—ఇప్పు డిందరియెదుటగూడ వాదప్రతివాదము లెందులకు?—ఆకలియగుచున్న నేమిచేయమందువు?

నార—ఏమియు వలదు—పదార్థము నాకడనే యున్నది. పచనము మాత్రము చేయింపవలెను.

విష్ణు—ఏ మాపదార్థము?

నార—గులకరాళ్ళు—

విష్ణు—ప్రపంచాతీతవ్యక్తివి!—

నార—ఈత్రిదేవులు—మున్ను—తమ కాలిగోటికైన, ననసూయ సాటిరాదని పల్కినపుడు—

లక్ష్మీ—గతము నూజిక త్రవ్వనేల?

నార—ఆనాడు—నే నాఁకలిచే, నీగులకరాళ్లను, గుగ్గిళ్లుగా పచనముఁ జేసియిమ్మని వేడుకొన—నీరెవ్వరు నన్ననుగ్రహింపక నన్ను వెఱ్ఱివానిక్రిందఁ గట్టివేసి, యొకవేళ మీాయనసూయ చేయునేమో యడిగిచూడుమని పలికిరి. కాన, మీాయందఱి సమక్షమున, నామహోత్సవము సల్పి, పరితుష్టాంతరంగుఁడను గానుంటిని.

లక్ష్మి—(అప॥) సరస్వతీ! చూడు మీానారదుని మాత్సర్యము!—పగగొన్నపామువలె—గులకరాళ్లను మూటగట్టుకొని, మన వెనువెంటఁ బడివచ్చి, యిప్పుడుసయిత మవమానింపఁజూచుచున్నాఁడు గదా!

సర—(అప॥) కానిమ్ము. ఇంతలో భయమేల? ఈ మెమాత్రము వండఁగలదా యేమి?

పార్వ—ఇంకను మీాకు వెఱ్ఱియేనా!—ఆమె యొనర్చిన యద్భుతములయెదుట నిది యేపాటికార్యము?—

నార—అమ్మా!—అనసూయాసతీ!—

గీ. పాఁడను బ్రహ్మచారిఁ, గాంతారహితుఁడ,
నైన బాలుడ నగుటచే, నాఁకటను ఓ
పించి, యాదటి నిటుల నర్థించువాఁడ
సీగులకరాలు వండి నాకిమ్ము తల్లి!!.

అన—మునీంద్రా! —త్రిదేవులకు వలనుగానికార్యము నావలన నగునా?

అత్రి—దేవీ! నీవొనర్చిన కార్యము లన్నిటికన్న నిది యధికమా!

అన —జీవితేశ్వరా!—మీయనుగ్రహముచే నేకార్యము కాదు!......

నార—అమ్మా!—అవసర మగునెడల, మీకొక బాణలియు, నగ్నియు గొనివచ్చి యిత్తునా?

అన—నారదా! —వానిని చూడనిమ్ము.

నార —(అనసూయచేత గులకరాళ్లు పోయఁగా, మెత్తనె గుగ్గిళ్లుగా మారుచున్నవి.)

అన—నారదా! —ఏమిది?—గులకరాళ్లు మెత్తనె గుగ్గిళ్లుగామారినవి.

నార —ఆహాహాహా—అనసూయాదేవి పతివ్రతామహాత్మ్యము!

ఆ. అగ్నిదీప్తి గాఁగ నమలసాధ్వీత్వమే-
బాణలిగఁ జెలంగ పాణితలమె-
రాలు వండి పచనలీల యొనర్చె, నీ
సాధ్వీమహిమ నెన్న సాధ్యమగునె?

అమ్మా!—లక్ష్మీపార్వతీసావిత్రిలారా! మున్ను నన్నున్మాదునిగ గణించి హాసించితిరే!—నన్ను మీరు కోరినచందముననే—యీగుగ్గిళ్ళను మీ కనసూయాప్రసాదముగ, సంతర్పణము చేయుచున్నాను.—గైకొనుఁడు.—తల్లీ!—శాంకరీ! మహిషాసుర మర్దనివగు నీవు మాకేమైన మిగులనిత్తువో లేదో!

విష్ణు—నారదా!—కోటలూడినపాములను గొట్టనేల?

నార—దేవా! నాకంతయపచారమనవసరము. వీరందఱీయనసూయాప్రసాదస్వీకారముచేసి, మీదోసములం బాపుకొనుఁడు.

(41 అనుబంధము.)

(అందఱకును పంచిపెట్టును.)

త్రిమూ—అనసూయాతుఁలారా! మీకు మంగళమగుఁగాక! మేమరుగుచున్నాము.

(ప్రస్థానము.)

లక్ష్మి—అమ్మా! సతీశిరోమణీ!—నీయనుగ్రహమున మేము మరల భర్తృలాభము నందితిమి. నీవు కీర్తిమతి వగుదువుగాక! మేమరిగెదము. సెలవిమ్మా. (ప్రస్థానోద్యుక్త లగుదురు.)

అన—భాగ్యము.

నార—అమ్మా!—ఇందిరాదేవీ! ఒక్కమాట!

లక్ష్మి—నారదా!—మరల నేమి?

నార—ఇప్పు డోడినవా రెవరు?—గెల్చినవా రెవరు?

లక్ష్మి—నారదా! మేమే యోడితిమి. ఈయనసూయయే జయించెను.

నార—సరే!—ఇక మీ రరుగవచ్చును. ఇందులకే పిలిచితిని.

లక్ష్మి—(స్వగ॥) అనసూయవలన నోడుటకు విచారము లేదు గాని, నారదుఁ డవమానించుటకు మిగుల విచారించుచున్నాను.

(ప్రస్థానోద్యుక్త లగుదురు.)

నార—అమ్మా!—అమ్మా!—ఒక్కమాట—ఒక్కటేమాట—చివరమాట.

లక్ష్మి—ఇంకను విముక్తి లేదుగాఁబోలును.

నార—కాదు కాదు—ఒక్క మాటయే—

లక్ష్మి—ఏదో తెమల్చు—

నార—మీపతులీయనసూయగర్భమున దత్తాత్రేయాకృతిని జన్మింతుమని చెప్పుటను మీరు వింటిరి గాదా!

లక్ష్మి—ఆఁ—వింటిమి—అం దన్పృతమేమున్నది.

నార—మీనోటఁగూడ నీమునిదంపతులకు సుపుత్రప్రాప్తి యగునట్లు దీవించి పొందు.

లక్ష్మి—ఆహా!—మనస్ఫూర్తిగా—సుపుత్రప్రాప్తిరస్తు.

(ముగ్గురు ప్రస్థానము.)

అత్రి—త్రికాలతత్త్వవిశారదా!—నారదా!—

సీ. అలత్రిదేవులకు నీ యనసూయపై విరోధమును వెంచిన చమత్కారి వీవె

అన—శోధింపఁజేసి మచ్ఛుభ్రకీర్తిని, దిశలను వెల్గఁజేసిన ఘనుఁడ వీవె

అత్రి—మూర్తిత్రయము నేక మూహూర్తమున, దరిశింపఁజేసిన మునిశ్రేష్ఠుఁ డీవె

అన—మనుజదుర్లభముగా ననఘుఁలౌ మూర్తులనొడిలోన జేర్చిన యలఘుఁ డీవె

అత్రి—యెంతయుశ్రమాభరంబు వహించి, నాకు నిష్టసిద్ధిని గూర్చు మునీంద్రుఁ డీవె

అన—తగ, మదీయరూపకసూత్రధారి వీవె

నారదా! మీరె—నీయుపకారగరిమ.

నార—ఇందు నాసామర్థ్య మేమియును లేదు. అంతయును, మీపుణ్యబలము—పోయివచ్చెద—నాకు వేళ యతిక్రమించె.

(అందఱు ప్రస్థానము.)

దృశ్యము—అదేరంగము.

[బాలుని డోలికలో నూపుచు అత్రి, అనసూయ ప్రి॥]

అత్రి—

గీ. బ్రహ్మ విష్ణు మహేశ్వర భవ్యరూప,
గర్భితం బగు నీసదాకార తేజ
మొక్కమా ర్మాకు గాన్పింపు మోకుమార!
విమలరూప దత్తాత్రేయ! విదితగేయ!

(దత్తాత్రేయాకృతి గాన్పించును. అత్రి అనసూయ మంగళము పాడుదురు.)

పతివ్రతాపము అను అనసూయానాటకము
సర్వమును సప్తమాంకము
సంపూర్ణము.



# అనుబంధములు.



1 పాపములు. బ్యాగ్—ఆది.

భీకరగతి మదవతి । నీదుగతి యా । దుర్భరతర ప్రయాసమును
గనుమా॥ భీ।

ఘోరా మాతో వాదమా । మేర లేనికూరిరమా । గెడపగ । నడ
పగ । నిక సుంతజాలమా॥ భీ।

2 గంగ. నాధనామక్రియ—రూపకం.

ఆపన్నరక్షకా । అఖిలాంతర్యామీ స్వామీ॥ ఆ। ఈపాపిని కేది
దారి । యొసంగింపుమ సురవిదారి॥ ఆ॥

చేతో । మోదంబుననీ । వేతలిదండ్రులుగ నెంచి । పాతకహారంబ
గునీ । పావననామముదలంచి । అఖిలదిశల నినుగాంచి।యను
పమానముగ నెంచీ । హరిహరియని మరిమరిదిశ లరయుచుండు
దీనబంధు॥ ఆ॥

3 గంగ.

ఇదే । సమయమురా ॥ అలఅలఅ॥ ఇ॥
మద దైత్యహారీ । మానసహాయకారీ ।
నీదయ చేత । నే । జగములునిలచును ।
నిరుపమానకరుణాంతరంగ । నిఖిలదానవాధిపమదభంగ ।
కరుణాకర । సురుచిర । దయాసాంద్రకమలలోచనా ।
విమలభాషణా॥ ఇదే॥

4 ఆకాశవాణి. మోహన—ఆది.

శుభమగునమ్మా । సుదతీ లెమ్మా ।
సదమలచరితయా । సాధ్వీని జేరుమా॥ శు॥

నిరుపమమహిమా । న్వితయగు నోకసతి।
నీయఘముల నశి । యింపగజాలును ।
రయముననాసతి । పదాంబుజంబుల ।
శిరగి నమస్కృతు । లొనరిచి వేడుము॥ సు॥

5 నారదుఁడు. బ్యాగ్—ఆది.

దీనావన । వరదా । ముకుందా ।
మానితబుధసంసేవనా॥ దీ॥
హరభవనుతపద । యాత్యంతరహిత ।
పరమపురుషగోవిందా అఅఅఅ॥ దీ॥

6 నారదుఁడు. సురట—దాదా్రి.

శ్రీనివాసజగదీశా । శుద్ధసత్వరూపా॥ శ్రీ॥ నారాయణ । వాసుదేవ । నరసురగరుడోరగనుత॥ శ్రీ॥ మాయామేయంబగునీ । మహితజగన్నాటకంబు । నడుపగసూత్రములదాల్చి । న, స్వయంభూ లోకేశ్వర॥ శ్రీ॥

7 గంగ. మోహన—దాదా్రి.

నిర్మలమానసలారా । నిరుపమానసతులారా ।
ధర్మపాలన, నిరతలారా । అఅఅఅఅఅ॥ ని॥
మీరుజగన్మాతలూ । మీపతులు జగత్పతులూ
కారుణ్యస్వరూపలు । జ । గన్నుతమహిమాత్మలూ ।
నాపాపంబులనుబాపి । ననుదయనిక గాంచుడమ్మ ।
మీపాదంబులు శరణ్య । మని చనుదెంచితినమ్మా॥ ని॥

8 త్రిదేవులు. నాయిక—దాద్రా.

తగదు నీకు శోకమందగా । తల్లీ । వగపేల నీకు॥ త॥
సుగుణవతివి । శుభచరితవు ।
నిగమవేద్య వమ్మ నీవు ।
విగతతాప వగు టిదేల ।
మగువా భూతము లివేల॥ త॥

9 నారదుడు—ఆదితాళం.

ఘాహో గంగా రయంబునను, భూ । తలమునకునూ ।
తడయకిపుడే । అత్రిమునీసతి । నరసి శరణువేడ॥ హో॥
అనసూయ ప । దాంబుజయుగళమె । నీయూపదలను నిఖిలము శాపగ । నీయెడలను దగినదిగావున నో నెలతాల్లొక్రై । కసాధ్వియాసతి॥ హో॥

10 త్రిదేవులు. బ్యాగ్—ఆది.

ఇదితగదు నారదా। నీ। మదహంకారవ । చనములుదెలసెను। ఇ॥
సుదతులందు భూసతినొకతె సాధ్వి। యనుచుమిగుల స్తుతియించుచునుంటివి । పదపద యికస్తుతి । పాఠములు మాని । మదింతువో । యెఱుంగవో మావిధ॥ మిది॥

11 కర్నాటక. కమాచి —ఆది.

ననుబాసినని తలచితివా॥ న॥ అఅఅఅఅఅ యికచాలును పలువా॥ న॥ ఈకొంగజపము। లీముంగితపము లేనెరుంగనని తలచితివా । కనులుమూయు టికచాలును తులువా । మొగము గడుగ నీళ్ళుదెమ్ము బిరబిర॥న॥

12 జైలాగు.

కర్క—ఛీ! వటవట వటవట వదరకుమా। దుష్టుడవయి నాతో।
దుర్మతివయి నాతో నిటు పలుకకుమా॥ ఛీ॥

అను—భూతలమందు ప। తివ్రతలందరు నీగతిబల్కుట నెరుగుదువా

కర్క—పలుకకుమా। వదరకుమా। రయమున॥ వ॥

అను—వయ్యారి। వీరీతి। గయ్యాళి। వైనాతో। వాదింపదగునా

కర్క—పలుకకుమా। వదరకుమా। రయమున॥ వ॥

---

(దీనికి అనుబంధసంఖ్య లేదు. సందర్భానుసారముగా
పాడుకొనవలెను.)

నాధనామక్రియ—ఆది.

అను—తెల్లవారగనె ప్రాణేశ్వరునకు। దండముపెట్టినసంసారీ।
పిల్లలకైనను పాలీయక। పెత్తనములు జేసిన వ్యభిచారీ॥ తె॥

కర్క—తెల్లవారగనె దుష్టురాలితో మగనిగొట్టినది సంసారీ।
పిల్లపాపలకు మగనికిసేవలు। జేయుచుండినది వ్యభిచారీ॥

13 అనుభవానందుడు.

మంగళం త్రిపురాసురవైరీ। సంగీతలోలా నిశాచరహారీ॥ మం॥

13 అనుభవానందుడు.

మంగళం నీకు మాయింటిదానా। కంగారుసేయకు గయ్యాళిచా
నా॥ మం॥ ప్రతిదినమును నీపదములు గడిగెద। కుతుకంబున
పెను। కుంభము బోసెద। చాన నీకు వందనంబు పల్కువాడ
నే॥ మం॥

## 14 అనసూయ. సావేరి—దాదాౘి.

గంగా । గురుదయాంతరంగా । నిఖిలకలుషకర । దానవభంగా॥
సం । గతఫలద । స । న్నుతవిబుధ । సం । తతవరద । అఖిల
లోక కల్యాణదాయినీ । యోగమానుగతి మంజుభాషిణీ॥ గం॥

## 15 లక్ష్మి. సురట—దాదాౘి.

వినరమ్మా । యిక నాసంకల్పము । వివిధభాషణంబు లేలనమ్మా॥
ఘనతరసాధ్వీ । లలామయని, నా । రదు డనసూయను స్తు
తియించెనుగద । మనకిదియవమానమంచు । దలపుడు । మను
జకామిని స । ణంపదలంపుడు॥ వి॥

## 16 నారదుడు.

తగదుసుడీ । యిదివినుడీ । అనసూయసాధ్వియని కనుగొనుడీ॥ త॥
మీకీప్రియత్న మవమానమునకె । హేతుభూతమగు నిక విరమిం
పుడి । తగదుసుడీ । వినుడీ । యికమనుడీ॥ త॥
మీర లేకాక । మీహృదయేశ్వరు । లారమణీమణి నెఱుంగజాల
రు । విమలమతిన్ । సుగుణవతిన్ । గనుడీ॥ త॥

## 17 అత్రిముని.

వినవేమంజువాణీ । యీచరితము । వినుతగీర్వాణీ॥ వి॥
నారదుడానతిచ్చిన వత్సరపుమితి ।
మీరుచుండుట మది । నారసి సావిత్రి॥
చారుతరమగు త్రిరాత్రివ్రత ।
సదాచరణము సలిపి । నాలవ ।
దినమునను వనికేగునాథుని।
దీనముఖియయి గాంచి తలచెను॥ వి।

18 అత్రిముని.

ఈతడు తనమృతి నెరుగడు ।
మృతిసూత్రము నింత్రైన నరయడు ।
కాలగతి । మహాత్మ్యము మీరనేరడు ।
ఇపుడు కానలకేగి । యింధనములుదేగ ।
దలచె సీతని నేడువదలిన ।
దప్పదు మహాపాయ మనుకొనె॥ వినవే॥

19 భృంగి.

పాపిని వయియుటు । పావను డగుననుు ।
బరాభవము సేయందగునా॥ పా॥
కోపమతివి । ఘన । పాపమతివి నీ ।
యుపహారములను దాకుదునా॥ పా॥
కాంచుమిదియేనా । మహాత్మ్యమున ఏను । వంచన జేసెదనిక సుదతీ
మించెను నినుర । త్రుంపువారి । బాధ్గించుకొనుము రయమున
కుమతీ॥ పా॥

20 అనసూయ—మిశ్రగతి.

దేవదేవా । సుప్రభావా రావా । ననువేగగావా॥ దే॥
ఈతడెవడో । భిక్షుకుడు నను । ఘాతసేయదలంచెగా భూత
మాగ్రహారీతి ననుహత । మార్పగా తలపూనెగా॥ దే॥

21 అనసూయ.

పలు । గాకీసాధ్వులను జెనకరాకూ॥ ప॥
ఈకలుమకృతము నీకూ । నా । శనకరము పరాకూ॥ ప॥
పరదారల మాతలనుచు భావమునదలంపు

మా గురుతర కోరిధాన్వితమతి ।
గొనక, మది భరింపుమా।
యరయగ సాధ్వీమహాత్మ్య । మసమానము । రిపు
హారము । చనుమా । వినుమా । యిక॥ పలు॥

22 అనసూయ.

సుపరిసన్నకీర్తీ । శుభమూర్తి । జగచ్చక్రవర్తి॥ సు।
అపరిమేయ । దీనావన । యాద్యంతశూన్యా ।
సుపరిభావ । లోకవిహిత ।
సురుచిరకల్యాణమూర్తి" సు॥
జగన్నాటకమును నీదు ।
సదమల చాతుర్యమహిమ ।
నగణిత చాతుర్యగతుల ।
నాడించి వినోదింతువు॥ సు।

23 అనసూయ.

ఇంతకన్న రక్షణసమయము నీ । కేదిరా జగద్రక్షకా॥ ఇం॥
శాంతుడయిన నా । కాంతుని కేయా । తంకముగలుగక గావు
మో ప్రభూ॥ ఇ॥
నీపద నీరజ విమలామృతమే । నిరతము మాకాధారము । నాపు
యి నీపెనుసర్పము నేడిది । యేమివిచిత్రమో । కాని యలము
కొనె॥ నిం॥

24 అత్రి.

నీ । సుగుణమె సదా । నిరుపమముదా । వహిమగు । ననదగు ।
విమలపదాంబుజ॥ నీ॥
జగంబుననునీ । సరియగు । సతితగు । పురుషునకే । పురుషార్థం
బులు వలయునటే । పరమపతివ్రతవగు॥ నీ॥

25 నర్మద.

హృదయేశా । అఘనాశా । సదయాత్మ్మడ వయినను దయగను

మా॥ హృ॥

ఘనవ్రిణములచే । ననయము వెతగని । నను మీా దాసిని । ట్లన

నేలా—ఆఆఆఆ॥ హృ॥

సతతము మీా పద । జలజంబులు గడిగి । సాంత్వనమును గావిం

చెద రమ్మా ఆఆఆఆ॥ హృ॥

26 నర్మద. జంగ్లా— ఆది.

హా జీవితేశ్వరా । హా దయాసాగరా । నీ జీవములను । విడచితి

వయయో॥ హా॥

రాజితమగునీ । దరిశనభాగ్యమె । చాలునటంచునే । సంతసమం

దితి॥ హా॥

(సాకీ॥)—హా । మదీయ జీవనాధారుండ వీవనీ । నీ మంగళాంగమే

యుంక నా కాధారమనీ ।

తలచి । చరణ జలజములను । గొలిచి । నిను స్మరించితిని । ద

యాంతరాంగ నీయపాంగ । ముల నిక బ్రిసరింపవయో॥హా॥

27 కౌశికుడు.

ఆనందమయ్యె వింతగా । వింతగా । భ్రాంతిగా । నంతరంగంబు

నందు॥ ఆ॥

ప్రపంచమెల్ల నాకు నే । డహాశోకనంబడెం గదా ఆహా । కనుల

కం । ధత్వమింతయేని లేదుగా॥ ఆనం॥

28 మన్మధుండు.

ఈ జగములన్ నను ప । రాజయము సలుపగల । భూజనము

లుండురె । విరాజితముగాగన్॥ ఈ॥

ధీజనులనైన । నా। తీవ్రశరచాపహతి । ధీరతనడంచినిస్త్రీజులను సల్పన్॥ ఈ।

29 లక్ష్మీ. కన్నడ—ఆది.

ఆలకింపుమో యవిజితరూపా । పాలింపుము నా పలుకుల నిపుడే॥ ఆ॥

జాలమికేలా । సదమలశీలా । ఆలసింపక నాయనసూయనుగని। మేలగునటు లా । మెకుభ్రమగొల్పుము । శీలమువిడగ జేయుము నేడే। ఆ॥

30 నారదుడు.

మోహన—ఆది.

తగదమ్మా యీ । పంతము మీకూ । అగణితసాధ్వీ మణినిటు సేయుట। తగ॥

విగతకలుష యగు । వినుతచరితను । జగదంబను పరీక్షింపదలంచుట। త॥

ఈప్రయత్నమున । నీపుత్రిడెకా । దోపగజాలరు । నీపతులయినను॥ త॥

31 అనసూయ.

పుష్పపరాగ । సుగంధిత । శీతా । కుసుమాయుధ మన్మథ పాహిమాం అలఅలఅలఅలఅలఅల॥ పు॥

పరమాదరణగనుమా । పాహిమాం॥ పు॥

నీవే ముల్లోకవిభుడ । నీవే । ప్రణయస్వరూపి । నీవే । ప్రకృతికి కారణ మీ । వే ॥ పు॥

హరికి సిరికి సుతుండవీ । వార్తశరణ్యుడవీవే పరమదయాపరుడవీ పాపహరుండవునీవే॥ పు॥

శ్యామలాంగ శుకవాహన । సకలజగజ్జనమోహన । నుతిపాత్రిర తీకళత్ర సతతమంగళాకార॥ పు॥

32 అనసూయ. కేదార — ఆది.

సాధ్వీల తెరవున కింకరాకుమా । సరిసరి తెలసెను కుటిలమతీ॥
సా॥ శార్దూలపు మీసలతో నుయ్యేలలాడందగవా । వినాశ మందగ॥ సా॥

దురాచరణమిటు సేయ దగదురా । శిరంబుశకలీభూతంబగురా ।
పరమపతివ్రితలను గవయగోరి । చెడినవారల నెఱుంగవుగా మది॥ సా॥

33 మన్మథుడు.

మాయామాళవగౌళ.

(సాకి) పరమదయా । కరీ। గురుమహిమాన్వితవనీ । మది నెరుంగ లేక — మూఢమతినై తిగా॥

(మిశ్రి) అనుపమదయాంభోధివై । నన్నాదరింపుమాసతీ । కమలభవ సమ । గణ్యాచరితవు । విమలమానస । వచలధృతివిక । సాద రంబునన్॥ పర॥

34 డైలాగు. సురట — ఆది.

లక్ష్మి — ఇటువలెనను మోసగించుటకునీ । కిదియేనపీనమా । కుటిలుడా॥ ఇ॥

తటుకున నేవిరెమో । మాయలనుబల్కి । కటకటా యిటుల నవమానించెద॥ విటు॥

విష్ణు — (త్రిశ్రి) చీటిమాటికిటులనలుగ । నేటుసహింతుమదవతీ। మాటికినను । మానహృదయ । మునవచింతు వేదికా॥

లక్ష్మి—చాలుచాలునీ ! యతివినయము । సంగతిదెలసె । పోపో
మ్మా । భూలోకకాంతలమెచ్చెదవీరీతి । మమునిరసించెదవల
తిగా॥ ఇ।

35 త్రిదేవులు. సురట—త్రిశ్రగతి.

మీపలుకులు చాలుచాలునిక । మిమ్మునమ్మగాదగునె॥ మీ॥
గోపనముకవలదు । స్వాదా । రవెశా । త్రవులై । రీగతి॥ మీ
ఒకభూసతి । కిటులభయము । గనుటగా మీపరితాపముగా ।
భువనపాలనం బదేల । కాల్పనా । ఘనతదెలసెను॥ మీ॥

36 అనసూయ—జంఝాటి మోహన.

దయసేయుడయ్యా । తాపసోత్తములార ధన్యజీవితనైతి॥ ద॥
నయశీలురగుమీరు । మూండుమూర్తులవోలె । దయగాంచు
టనాకు । ధరణిచరితార్థంబు । రయమునను । మత్సపర్యల
ను గాంచుడువేగ॥ ద॥

37 త్రిదేవులు. మోహన—త్రిశ్రగతి.

ఓనారదమునినాథా । నేడే చనుమాధరణికి॥ ఓ॥
మానితుడవు సమ్మతుడవు । మాపతులను మాకొసంగి । మాం
గల్యములు దయచేసి । మానము గాపాడుమయ్యా॥ ఓ॥

38 నారదుడు.

మోహన - ఆది.

చనుడమ్మా । ధరణీతలమునకిక । సరగున నాసతి పాదంబులబడ
గ॥ చ॥
మనమునదలపక । చేసినతప్పులు । మన్నింపుమనుచు । మగలని
మ్మనుచు॥ చ॥
(త్రిశ్ర) ఆమె సకలనిగమవినుత । యతిశయసాధ్వీమతల్లి । మీమ
గలకు । జననియయ్యె । మీకవశ్యశరణ్యయగు॥ చ॥

## ప్రబంధములు.



| | |
|---|---|
| భాగవతరత్నములు | 1- 0-0 |
| భగవద్గీత | 1- 0-0 |

### కీర్తనలు.

| | |
|---|---|
| అధ్యాత్మరామాయణ కీర్తనలు | 0- 8-0 |
| రామాయణ భజనకీర్తనలు | 0- 4-0 |

### నవలలు.

| | |
|---|---|
| మహాభయంకరమగు గజదొంగ | 0-12-0 |
| భగవద్గీత తాత్పర్యసహితం | 1- 0-0 |
| కలికాలచర్య | 0- 6-0 |
| నాటకముల పాటలు | 0- 8-0 |

### హాస్యగ్రంథములు.

| | |
|---|---|
| భోగముమోక్షము | 0- 2-0 |
| వేశ్యామృతము | 0- 1-6 |
| మగషోకు | 0- 1-0 |
| కర్ణామృతము | 0- 2-0 |
| శారదయామిని | 0- 1-6 |

వలయువాడు—కురుకూరి సుబ్బారావు,
బుక్కు—సెల్లర్ అండ్ పబ్లిషర్,
భీమడోలు ప॥ గోదావరిజిల్లా.

## –: నాటకరత్నములు :–



| | |
|---|---|
| సంపూర్ణమహాభారతము బళ్లారి పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రి | 1-4-0 |
| రసపుత్రవిజయము ఇ॥ య॥ | 1-0-0 |
| రాణాప్రతాప్‌సింగ్ డిటో | 1-0-0 |
| ప్రతాపరుద్రీయము సో॥ రా॥ | 1-4-0 |
| ఆలీబాబా 40 దొంగలు॥ డిటో | 0-12-0 |
| రాధాకృష్ణలీల కం॥ వేం॥ | 0-12-0 |
| వృద్ధవివాహము గో॥ వేం॥ | 0-12-0 |
| రోషనార అను జహ్వారిబాయి బ॥కో॥ | 0-12-0 |
| మైలవరం కంపెనీవారిచే ప్రదర్శింపఁబడు | |
| ద్రౌపదీవస్త్రాపహరణము మ॥ అ॥ | 1-0-0 |
| మైలవరం కంపెనీవారిచే ప్రదర్శింపఁబడు | |
| సావిత్రినాటకము శ్రీ॥ స॥ | 1-0-0 |

వలయునారు—

కురుకూరి సుబ్బారావు,
బుక్కు–సెల్లర్ అండ్ పబ్లిషర్
భీమడోలు ప॥ గోదావరిజిల్లా.